ప్రపంచ తెలుగు మహాసభ ప్రచురణ

# తెలుగువారు-క్రీడారంగం

రచయిత

ఏకా వేంకట సుబ్బారావు




ప్రపంచ తెలుగు మహాసభలు
3-4-526/18 బర్కత్‌పుర
హైదరాబాద్ - 500027

ప్రపంచ తెలుగు మహాసభ ప్రచురణ

# తెలుగువారు - క్రీడారంగం


రచయిత :

ఏకా వేంకట సుబ్బారావు






ప్రపంచ తెలుగు మహాసభ

3-4-526/18 బర్కత్‌పురా

హైదరాబాద్ - 500027

# ముందుమాట

ఎన్నో ఏళ్ళుగా అనుకొంటున్న ప్రపంచ తెలుగు మహాసభలు జరుగనున్న పర్వసమయం ఆసన్నమవుతున్నది. ప్రపంచంలోని తెలుగువారి ప్రతినిధు లందరిని ఒకచోట సమీకరించవలసిన పెద్దలందరూ కన్నకలలు ఫలిస్తున్న శుభసమయమిది. రాబోయే ఉగాది రెండువేల అయిదువందల సంవత్సరాల తెలుగుజాతి చరిత్రలో మరపురాని మధుర ఘట్టము కాగలదు.

క్రీస్తుపూర్వం మూడవ శతాబ్దికి చెందిన శాతవాహనరాజుల కాలంనుండి తెలుగు ప్రజలకు ఒక విశిష్టమైన చరిత్ర ఉన్నది. భారతదేశంలో తెలుగు మాట్లాడే ప్రజలు దాదాపు ఐదుకోట్లకుపైగా ఉన్నారు. హిందీ మాట్లాడేవారి తరువాత స్థానం తెలుగువారిదే. బౌద్ధ పూర్వయుగంనుంచి ఇటీవల బ్రిటిష్ సామ్రాజ్య పరిపాలనాయుగం వరకూ తెలుగువారు పెద్దఎత్తున ప్రపంచ నలు మూలలకూ వలసవెళ్ళడం జరిగింది. అట్లావెళ్ళిన తెలుగువారు తమ భాషా సంస్కృతీ సంప్రదాయాలను ఆయా జాతీయ జీవన విధానాలతో మేళవించి, వాటిని సంపన్నం చేస్తూ ఉన్నారు.

ప్రపంచ తెలుగు మహాసభల ప్రధానలక్ష్యం తెలుగుప్రజల, తెలుగు అభిమానుల ప్రతినిధులను ఒక వేదికమీద సమావేశపర్చడం. జాతీయ, అంతర్జా తీయ సాంస్కృతిక రంగాలలో తెలుగువారు చేయవలసిన కృషినిగూర్చి చర్చించి, నిర్ణయించుకోవడానికీ, తద్వారా వివిధ చైతన్యస్రవంతులను ఏకోన్ము ఖంచేసి మన సాంస్కృతిక సంబంధాలను దృఢతరం చేసుకోవడానికి ఈ మహా సభలు దోహదకారులు అవుతవి. అంతేకాక ఈ మహాసభలు అర్ధ్రమైన భావ సమైక్యతకు ప్రాతిపదికలై తెలుగుజాతిని సమైక్యం చేయగలవనీ, ఆ విధంగా జాతీయ అభ్యుదయానికి తోడ్పడగలవనీ విశ్వసిస్తున్నాను.

1975 ఏప్రిల్ 12వ తేదీన తెలుగు ఉగాది రోజున ప్రారంభమై ఒక వారం రోజులపాటు జరిగే ఈ మహాసభలలో వివిధ దేశాలనుంచీ, వివిధ రాష్ట్రాలనుంచీ, యునెస్కోవంటి అంతర్జాతీయ సంస్థలనుంచీ వచ్చిన ప్రముఖులు

ప్రతినిధులుగానో, పరిశీలకులుగానో పాల్గొంటారు. ఈ మహాసభల సమయంలో చర్చాగోష్ఠులు, ప్రదర్శనలు, ప్రచురణలు మొదలైన కార్యక్రమాలు జరుగుతాయి. దేశ దేశాలలోని తెలుగువారి సంస్కృతి, తెలుగు భాషా సాహిత్యాల కళల అభివృద్ధి, వైజ్ఞానిక సాంకేతిక ప్రగతి మొదలయిన విషయాలపై చర్చాగోష్ఠులు జరుగుతవి. తెలుగువారి సాంస్కృతిక వైభవాన్ని వివిధ కోణాల నుంచి ప్రస్ఫుటంచేసే ఒక ప్రదర్శన ఏర్పాటు అవుతున్నది. తెలుగువారి సమగ్ర స్వరూపాన్ని సందర్శించడానికి వీలైన సంగ్రహాలయాన్ని "మ్యూజియంను" స్థాపించడానికి ఈ ప్రదర్శన బీజభూతమవుతుంది. తెలుగువారి సంస్కృతిని నిరూపించే సాంస్కృతిక కార్యక్రమాలు వారం రోజులపాటు సాగుతవి. తెలుగుప్రజల సంస్కృతీ సంప్రదాయాలను విశదంచేసే ప్రత్యేక సంచికలు తెలుగు, ఇంగ్లీషు, హిందీ, ఉర్దూ భాషలలో విడుదల అవుతాయి. ఈ కార్యక్రమాలలో భాగమే ఈ గ్రంథ ప్రచురణ.

తెలుగు ప్రజలు భాష, సాహిత్యం, చరిత్ర, సంస్కృతి, కళలు మొదలైన వివిధ రంగాలలో సాధించిన ఘన విజయాలను విశదంచేసే గ్రంథాలు అనేకం ఈ మహాసభల సమయంలో విడుదల అవుతాయి. ఈ గ్రంథాలను రచించి, సకాలంలో మాకు అందించిన రచయితలందరకూ నా కృతజ్ఞతలు. తెలుగువారి విశిష్టతలను విశదంచేసే ఈ గ్రంథాలు సహృదయులందరి ఆదరణ పొందగలవని విశ్వసిస్తున్నాను. అయితే, ఇంతమాత్రంచేతనే ప్రపంచ తెలుగు మహాసభల ఆశయాలు సఫలం కాగలవని నేను అనుకోవడంలేదు. చేయవలసినది ఇంకా ఎంతో ఉంది. ఈ మహాసభల సందర్భంగా నెలకొల్పబడనున్న "అంతర్జాతీయ తెలుగు విజ్ఞానసంస్థ" మహాసభల ఆశయ సాధనకు పూనుకొనడమే కాక జాతీయ, అంతర్జాతీయ సాంస్కృతిక సంబంధాలను దృఢతరం చేయగలదని నమ్ముతున్నాను.

జలగం వెంగళరావు
అధ్యక్షులు
ప్రపంచ తెలుగు మహాసభలు

# క్రీడారంగం

బౌద్ధయుగంలో వ్యాయామ వేత్తలు అనేక సత్కారములు పొందినట్లు అమరావతి, నాగార్జున కొండ, గుంటుపల్లి మున్నగచోట్ల లభించిన శిల్పాలను బట్టి తెలుస్తున్నది. మన తెలుగువారు ఎక్కడికి వెళ్ళినా తెలుగు తల్లికి కీర్తి తెచ్చారు. క్రీడారంగంలో తెలుగువారికి ఘనమయిన చరిత్ర వుంది. భారతదేశంలో బ్రిటిషువారి హయాంలో క్రీడారంగం ఒక జాతీయోద్యమంగా నిర్వహించబడ లేదు. ఆటల్లో ఆసక్తి వున్న యువకులు తామై ముందుకువచ్చి, స్వల్ప అవకాశ ములను వినియోగించుకొని పేరుప్రఖ్యాతులు తీసుకువచ్చారు. మన తెలుగు క్రీడారంగ జాతీయ, అంతర్జాతీయ క్రీడాప్రగతిని సమీక్షిస్తున్నాను.

బ్రిటిషువారి పాలనలో విజయనగరం బొబ్బిలి, తుని, పిఠాపురం, వెంకటగిరి రాజులు, నూజవీడు, వుయ్యూరు, ఎలమర్రు మున్నగు అనేకమంది జమీందార్లు క్రీడలకు ప్రోత్సాహమిచ్చారు. వారి ఆదరణవల్ల వెలుగులోకి వచ్చిన తెలుగుక్రీడాకారులు కోడి రామమూర్తి, నల్లంరెడ్డి కృష్ణస్వామి, దుగ్గిరాల పూర్ణ చంద్రరావు, మాధవపెద్ది జానకిరామయ్య మున్నగువారు. కోరుకొండలో విజయ నగరం మహారాజా నిర్వహించిన క్రీడాపోటీలు, ఏలూరు సయ్యద్ మహమ్మద్ స్మారకపోటీలు, అన్నవరం సత్యనారాయణ టోర్నమెంటు, వెంకటగిరి రాజా టోర్నమెంటు యిప్పుడు జరిగే జాతీయ పోటీలకంటే ఎక్కువగా జరుపబడేవి. వరంగల్లులో జరిగిన రషీద్ మెమోరియల్ టోర్నమెంట్సు అన్నిక్రీడలల్లోనూ, భారతదేశం నలుమూలలనుండీ ఎక్కువ జట్లను ఆకర్షించినవి. ఇతర రాష్ట్రా లలో కూడా తెలుగువారు విశేష ప్రజ్ఞను ప్రదర్శించి తెలుగువారికి కీర్తిని తెచ్చి పెట్టారు. మన రాజధాని నగరమైన హైదరాబాదులో 1885 నుండి నవాబులు, రాజులు వివిధ క్రీడలను ఆదరించారు. హైదరాబాదులో క్రికెట్ అభివృద్ధికి పాటుబడినవారిలో రాజాధనరాజగిర్, నవాబ్ మొయిన్ ఉ-దౌలా బహదూర్ ముఖ్యులు. ఫుట్‌బాలు ఆటకు జీవం పోసిన వారిలో సి. వి. పద్మారావు, మహా రాజాకిషన్ ప్రసాద్ బహదూర్, నవాబ్ బెహ్రామ్ ఉ-దౌలా ముఖ్యులు.

తెలుగువారి ఘనకీర్తిని చాటిన కొఠారి కుటుంబాన్ని ముందుగా చెప్పుకోవాలి. వారి స్వగ్రామం బందరు. కొఠారి నారాయణస్వామిగారు బసను నాగపూర్‌కు మార్చారు. 1875 వ సంవత్సరం నాగపూర్‌లో ఆంధ్రమహాసభను ఏర్పాటుచేసి అనేక తెలుగు కుటుంబాలను పోషించారు. వీరి పుత్రులు వేంకటరామన్న నాయుడు, సూర్యప్రకాశరావునాయుడు. ఆ రోజుల్లో కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో "హెర్క్యులస్"గా పేరొందిన రంజిత్‌సింహజీతో కలిసి సూర్యప్రకాశరావునాయుడుగారు క్రికెట్ ఆడేవారు. సూర్యప్రకాశరావునాయుడుగారి కుమారులు కనకయ్య నాయుడు (సి కె. నాయుడు), సుబ్బయ్యనాయుడు (సి. ఎస్. నాయుడు), రంగయ్యనాయుడు (సి. ఆర్. నాయుడు). సి కె. నాయుడుగారు తండ్రిగారి సహాయంతో ఏడవ ఏటనే క్రీడారంగంలో అడుగు పెట్టేరు. క్రికెట్ ఆటలో ప్రపంచఖ్యాతిగాంచిన వీరు అత్లేట్సు. ఫుట్‌బాలు, హాకీ, టెన్నిస్, టేబుల్ టెన్నిస్, పోలో, షూటింగ్ మున్నగు క్రీడల్లోకూడా మేటిగా పరిగణింపబడ్డారు. నాగపూర్‌లో "నాయుడు క్రికెట్ జింఖానా" నిర్వహించారు. 1890-1900 మధ్యకాలంలో యీ సంస్థ ఏడాదికి పది, పదిహేను వేల రూపాయలు ఖర్చుచేసేవారు. సి. కె. నాయుడు క్రీడారంగంలో చిన్నప్పటి నుండి కృషి చెయ్యబట్టే 58 వ ఏట కూడా క్రికెట్‌ఆటలో తమ ప్రావీణ్యాన్ని చూపెట్టగల్గారు. 37 సంవత్సరాల క్రికెట్ చరిత్రలో గర్వించతగ్గ విజయాలు నాయుడుగారు సాధించారు. 1932 వ సంవత్సరం బ్రిటన్‌లో పర్యటించి టెస్టు పోటీలలో పాల్గొన్న భారతజట్టు నాయకులు. మొదటి పోటీలోనే సి. కె. 118 పరుగులు చేసి అవుటు కాలేదు. బ్రిటన్ పర్యటనలో వీరుచేసిన మొత్తంపరుగులు 1,618. అంతకుమందు 1926-27 లో ఎమ్. సి. సి. జట్టు భారతదేశం పర్యటించినప్పుడు బొంబాయిలో హిందువుల జట్టులో ఆడుతూ ఒకే యిన్నింగ్స్‌లో 11 సిక్సర్స్ కొట్టిమేటి ఆటగానిగా పరిగణింపబడ్డారు. "సి. కె. సిక్సర్" అని ప్రేక్షకులు మిన్నుముట్టేట్లు అరుస్తూవుంటే, సులువుగా సిక్సర్స్ కొట్టేవారు. 65 నిముషాలలో 100 పరుగులు, 100 నిముషాలలో 187 పరుగులు చేశారు. 1932వ సంవత్సరం బర్మింగ్‌హామ్‌లో పోటీచేసినప్పుడు సి. కె. 162 పరుగులు చేశారు. 1936 వ సంవత్సరం మళ్ళీ బ్రిటన్ పర్యటించారు. వీరుచేసిన ఎక్కువ పరుగులు 200. మొదటి సెంచరీ 1920 వ సంవత్సరం చేశారు. తమ 50 వ ఏట

క్రికెట్ పోటీలలో పాల్గొని 200 పరుగులు చేసి ఆశ్చర్యచకితులను చేశారు. బౌలింగ్‌లో కూడా నాయుడుగారు ప్రతిభాశాలి. ఉన్నతశ్రేణి క్రికెట్ పోటీనుండి 1958 నవంబరు, 23 వ తేదీనుండి విరమించారు. చివరిసారిగా ఆంధ్రజట్టుకు నాయకత్వం వహించారు. క్రికెట్ ఆటలో వీరుచేసిన సేవకు భారత ప్రభుత్వం 1956 వ సంవత్సరంలో "పద్మభూషణ్" బిరుదును యిచ్చి సత్కరించింది.

"సి. కె." సోదరుడు సి. ఎస్. నాయుడు కూడా క్రికెట్ ఆటలో మంచిపేరు సంపాదించారు. 1936 వ సంవత్సరం బ్రిటన్‌లో పర్యటించిన భారత క్రికెట్ జట్టు సభ్యులు. 1949-50 లో భారతదేశం పర్యటించిన కామన్ వెల్తు క్రికెట్ జట్టుతో పోటీ చేసిన భారతజట్టు సభ్యులు 1936 నుండి 51వరకూ అనేక టెస్ట్ పోటీలలో పాల్గొన్నారు. 1953-54 లో ఆంధ్రజట్టులో పాల్గొని మైసూరు జట్టుమీద 113 పరుగులకు ఆరు వికెట్లు నష్టపరచి ఆంధ్రాధికార్డును నెలకొల్పారు. 55-56 సంవత్సరం ఆంధ్రజట్టు నాయకులు. కొఠారి కుటుంబం యీనాటికీ క్రీడారంగంలో పేరు ప్రఖ్యాతులు గడిస్తూనే వుంది.

తర్వాత చెప్పతగినవారు "కోట"వారి వంశం. బ్రిటిష్‌వారి పరిపాలనలో క్రికెట్ ఆట మన భారతదేశంలో ప్రవేశపెట్టబడిన తొలిరోజుల్లో మన భారతీయులతో కలిసి ఆడాలంటే బ్రిటిష్‌వారికి నామర్దాగా వుండేరోజులవి. అటువంటి రోజుల్లో కోట బుచ్చిబాబు నాయుడు విశేషప్రజ్ఞను ప్రదర్శించి భారతీయులతో కలిసి ఆడడానికి మార్గదర్శకులైనారు. వారికుమారులే కోటరామస్వామి, రామానుజం, బాలయ్య. వీరు ముగ్గురూ క్రికెట్ ఆటలో గొప్పపేరు సంపాదించారు. 18 జూన్ 1896 లో జన్మించిన రామస్వామి 1920 వ సంవత్సరంలో కేంబ్రిడ్జి వెళ్ళి మూడు సంవత్సరాలు టెన్నిస్ ఆడారు. అప్పుడే "కేంబ్రిడ్జి బ్లూ" పొందారు. 1922వ సంవత్సరం డేవిస్‌కప్ పోటీలలో పాల్గొనిన భారతజట్టు సభ్యులు డేవిస్‌కప్ పోటీలలో పాల్గొనిన మొదటి తెలుగువారు వీరే. ఇంగ్లండ్ టెన్నిస్ పోటీలలో పాల్గొని సింగిల్సు ఛాంపియన్‌షిప్‌ను సాధించారు. 1924 వ సంవత్సరంలో మన భారతదేశం తిరిగివచ్చారు. వీరి అభిలాష టెన్నిస్‌నుండి క్రికెట్ ఆటకు మరల్చారు. 1936 వ సంవత్సరం బ్రిటన్‌లో పర్యటించిన భారత క్రికెట్ జట్టు సభ్యులు. 40 వ ఏట తొలిసారిగా క్రికెట్ టెస్ట్‌పోటీలలో

పాల్గొన్నారు. 1947 నుండి 50 వరకూ, 1952-56 వరకూ భారత క్రికెట్ కంట్రోల్ బోర్డు సెలక్షన్ కమిటీ సభ్యులు. ప్రస్తుతం వీరు మద్రాసులో వుంటూ క్రీడా రంగంలో సేవ చేస్తున్నారు.

డాక్టర్ విజయానంద్ భారత క్రికెట్ క్రీడాకారులలో ఒకరు. వీరి క్రికెట్ ఆటను చూసిన ఎనిమిదవ ఎడ్వర్డ్ చక్రవర్తి "సర్" బిరుదును యిచ్చి సత్కరించారు. స్వాతంత్ర్యం రాకముందే "సర్" బిరుదును పొందిన మొదటి తెలుగు క్రీడాకారులు వీరే. భారత దేశంలో క్రికెట్ ఆటను వృద్ధిలోకి తెచ్చుటకు ఎంతో డబ్బువ్యయం చేశారు. 1936 వ సంవత్సరం ఇంగ్లండ్‌లో పర్యటించిన భారత క్రికెట్ జట్టు సభ్యులు. చాలాకాలం భారత క్రికెట్ కంట్రోల్ బోర్డు అధ్యక్షులుగా వున్నారు. వీరు గొప్పదేశభక్తులుకూడా. రాజకీయరంగంలో కూడా ప్రముఖపాత్ర వహించారు.

తెలుగువారికి కీర్తి ప్రతిష్ఠలు తెచ్చిపెట్టిన ముఖ్యుల్లో కోడి రామమూర్తి ఒకరు. వీరి జననం 1860. స్వగ్రామం విజయనగరం సమీపాన వీరఘట్టం. వీరి తండ్రి సత్యనారాయణస్వామి కూడా గొప్ప బలవంతులు. ఆ రోజుల్లో ప్రపంచ బలశాలి అయిన జర్మన్ దేశస్థుడు ఈజెన్‌శాండోను మించి పోవాలని రామమూర్తిగారు వ్యాయామంలో కృషి చేసారు. వీరికి తుని మహారాణి ప్రోత్సాహమిచ్చారు. 1907 సంవత్సరం మద్రాసు వచ్చిన ఈ జెన్ శాండో, రామమూర్తి రొమ్ముపై ఏనుగును ఎక్కించుకొనే బలశాలి అని తెలుసుకొని చల్లగా జారుకున్నారు. రామమూర్తిగారు యూరప్ అంతా పర్యటించి ప్రపంచ బలశాలిగా పరిగణింప బడ్డారు. లండన్‌లో వున్నప్పుడు బ్రిటిష్ చక్రవర్తి "కలియుగ భీముని"గా కీర్తించారు. వీరివద్ద విదేశీయులు కూడా ముష్టి యుద్ధం నేర్చుకున్నారు. నాయుడు సర్కస్, ప్రపంచంలో కెల్ల పెద్దదని అనినారు. వీరు ఎంత సంపాదించారో, అంతదానధర్మాలకు ఖర్చు పెట్టారు. వీరిశిష్యులే రోశ్క్ల శీతారామయ్య, పైడిరాజు భారతదేశమంతా పర్యటించి అనేక బలప్రదర్శనలను యిచ్చారు.

మల్ల విద్యా వ్యాప్తికి కృషి చేసినవారిలో కమ్మల అప్పన్న ఒకరు. తమజీవితంలో అనేకవేల రూపాయలు వ్యాయామంకోసం వినియోగించారు.

ఏలూరులో ప్రప్రథమంగా స్త్రీలకు ప్రత్యేక వ్యాయామశాలను నిర్వహించిన ఘనత వీరికే దక్కింది. భారతదేశంలో, వ్యాయామంలో మన తెలుగు వారికి మించిన వారు లేరని నిరూపించిన వారిలో "వ్యాయామకళాప్రపూర్ణ" గజ్జి వీరరాఘవగుప్త, మోచర్ల శ్రీహరిరావు, బులుసు రామజోగారావు. "ఆంధ్రభీష్మ" పాపోలు వీర వెంకయ్య, "ఇండియన్ హెర్క్యులస్" ధవళ కూర్మనాథశర్మ, కె. బి. హరికృష్ణ ముఖ్యులు.

క్రీడారంగంలో ప్రపంచ ఖ్యాతిని గాంచిన హైదరాబాదు వాస్తవ్యులు హాదీని చెప్పుకోవాలి. వీరి అన్నదమ్ములు అయిదుగురు. అందరూ క్రీడాకారులే. మూడు క్రీడల్లో ప్రపంచ ఖ్యాతిని సంపాదించిన ప్రథమ క్రీడాకారులు వీరేనని చెప్పక తప్పదు. వీరు టెన్నిస్, క్రికెట్, ఫుట్‌బాలు ఆటల్లో గొప్ప పేరు సంపాదించారు; 1920 నుండి 41 వరకూ క్రీడారంగంలో సాధించిన ఘన విజయాలు వందల సంఖ్యలో వున్నవి. హైదరాబాదు విద్యాశాఖలో డిప్యూటీ డైరెక్టరుగా పనిచేసి, 1951వ సంవత్సరంలో పదవి విరమణ చేశారు. వీరికృషి వల్లనే గ్వాలియర్‌లో జాతీయ వ్యాయామ కళాశాల నెలకొల్పబడింది.

బ్రిటిషువారి వల్లనే టెన్నిస్ ఆట మన భారతదేశంలో అడుగు పెట్టింది. ఆరోజుల్లో బ్రిటిషు వారు మన భారతీయులను దగ్గరకు చేరనిచ్చే వారే కారు. కొంతకాలం తర్వాత పెద్ద ఉద్యోగస్తులను మాత్రమే రానిచ్చారు. 1920వ సంవత్సరంలో ప్రప్రథమంగా మన భారత దేశం అంతర్జాతీయ టెన్నిస్ పోటీలలో పాల్గొన్న మన భారతజట్టులో మన తెలుగువారు కోటరామస్వామి పాల్గొన్నారు. వారి తర్వాత అగ్రశ్రేణి ఆటగాళ్ళుగా నారుమంచి నారాయణ మూర్తి, నల్లంరెడ్డి కృష్ణస్వామి, దుగ్గిరాల పూర్ణచంద్రరావు మున్నగు వారు పరిగణింప బడ్డారు. నల్లంరెడ్డి కృష్ణస్వామి 1929వ సంవత్సరం నుండి ప్రముఖ ఆటగానిగా పేరొందారు. వీరు 1930లో ఫ్రెంచి ఆటగాళ్ళతోనూ, 1931 లో బ్రిటిష్, జపాను జట్లతోనూ, 1932లో ఇటలీ జట్టుతోనూ, 1935లో యుగొస్లావియా జట్లతోనూ పోటీచేసారు. 1936వ సంవత్సరం మధ్యయూరప్ పర్యటించిన భారతజట్టు ప్రతినిధి. 1935-36 సంవత్సరములు సింహళంలో

జరిగిన టెన్నిస్ సింగిల్సును గెలుచుకున్న మొదటి భారతీయుడు వీరే. వీరు చాలాకాలం భారత టెన్నిస్ సంఘ కార్యదర్శిగా వుండి ఎనలేని సేవ చేసారు. తెనాలి వాస్తవ్యులు దుగ్గిరాల పూర్ణ చంద్రరావు 1928వ సంవత్సరంలో మొట్ట మొదటి సారిగా విజయవాడలో జరిగిన టెన్నిస్ పోటీలలో విజయం సాధించారు. 1932-33 లో కాశీ హిందూ విశ్వ విద్యాలయం టెన్నిస్ ఛాంపియన్, 1936లో నైరోబీలో జరిగిన కెన్యా లాన్‌టెన్నిస్ పోటీలలో భారత ప్రతినిధిగా పాల్గొన్నారు. వీరు భారతదేశంలోని అనేక పెద్ద పోటీలలో పాల్గొని ఘన విజయాలు సాధించారు.

1910 నుండి 1925వ సంవత్సరం వరకూ దక్షిణ భారత దేశంలో నారుమంచి నారాయణమూర్తి ప్రముఖ ఆటగాడిగా పరిగణింప బడ్డారు. తూర్పు గోదావరి జిల్లాకు చెందిన నందివాడ వెంకట్రావు 1928 నుండి 35 వరకూ టెన్నిస్ ఆటలో భారతదేశంలో మేటి ఆటగాడిగా నిలబడ్డారు. కలకత్తా ఢిల్లీ, మద్రాసు మున్నగు చోట్ల జరిగిన టెన్నిస్ పోటీలలో ఘన విజయాలు సాధించారు; 1932 నుండి 42 వరకు ఎస్. నారాయణరావు మంచి పేరును సంపాదించారు. 1937 కలకత్తా, 1941 కరాచీలో జరిగిన టెన్నిస్ పోటీలలో పాల్గొని డబుల్సు ఛాంపియన్‌షిప్‌ను గెలుచు కున్నారు. వీరికి ఎన్. రామారావు జత ఆటగాడు. రాజమండ్రి నివాసి అయిన టి. రామలింగస్వామి 40 సంవత్సరాలు టెన్నిస్ ఆటలో సాధించిన విజయాలు కొన్ని వందలు వున్నాయి. వీరు ఫుట్‌బాలు, క్రికెటు, టేబుల్-టెన్నిస్ ఆటల్లో కూడా మంచి పేరును సంపాదించారు. టంగుటూరి అచ్యుత రామారావు 1945 వ సంవత్సరం వరకు ప్రసిద్ధ టెన్నిస్ ఆటగాడిగా పరిగణింపబడి, మద్రాసు రాష్ట్ర సంఘ శిక్షకులుగా చాలా కాలం వ్యవహరించి అనేక మంది యువతీయువకులను వెలుగులోకి తెచ్చారు. మద్రాసు రాష్ట్ర టెన్నిస్ సంఘానికి గణనీయమైన సేవచేసి, యిటీవలనే 68వ ఏట హైదరాబాదులో పరమపదించారు. 1938 నుండి 1952 వరకూ పి. ఎల్ నారాయణరావు భారతదేశంలోని అనేక పెద్ద పోటీలలో పాల్గొని ఘన విజయాలు సాధించారు. ముఖ్యంగా టెన్నిస్ రంగంలో చెప్పదగిన జంట మాధవ పెద్ది జానకి రామయ్య, ఎస్ భుజంగరావు. ఈ జంట

భారతదేశంలోని అనేకమంది ప్రముఖ ఆటగాళ్ళను ఓడించారు. 1945వ సంవత్సరం మద్రాసులో ప్రముఖ ఆటగాళ్ళయిన సుమంతమిశ్రా, యుధిష్టర్ సింగ్‌లను, బి. ఆర్. కపినపతి, ఖలీద్‌లను ఓడించారు. అదే సంవత్సరం ఘౌస్ మహమ్మద్, యుధిష్టర్ సింగ్‌లను ఓడించి సంచలనం కల్గించారు. మచిలీపట్నంకు చెందిన మాకర్ల రామారావు టెన్నిస్ ఆటలో 1934 నుండి 1949 వరకూ భారత దేశంలో ప్రసిద్ధ ఆటగానిగా పేరొందారు.

మొన్న మొన్నటి వరకు ఉస్మానియా విశ్వవిద్యాలయ శిక్షకులుగా పని చేసిన ఘౌస్ మహమ్మద్ టెన్నిస్ ఆటలో ప్రపంచమేటి ఆటగానిగా పరిగణింపబడ్డారు. 1936 నుండి 1945 వరకూ 11 సంవత్సరాలు భారతదేశ టెన్నిస్ ఛాంపియన్. 1939వ సంవత్సరం ఘౌస్ మహమ్మద్ వింబుల్డన్ టెన్నిస్ పోటీలలో పాల్గొని, హంగరీ ఆటగాడయిన స్జిగెటీతో రెండున్నర గంటలు హోరాహోరీ పోరాడి ఓడించి పాదాంతిమ పోటీకు చేరుకున్నారు. వింబుల్డన్ టెన్నిస్ పోటీలకు పాదాంతిమ పోటీకి చేరుకోగల్గిన ప్రథమ భారతీయులు వీరే. ఈ మేటి ఆటగాడు మన రాజధాని నగరంలోని అనేక మంది యువతీ యువకులకు శిక్షణ యిస్తున్నారు. ఉస్మానియా విశ్వవిద్యాలయ టెన్నిస్‌జట్టును ప్రతిష్ఠంచేసే గౌరవంకూడా వీరికే దక్కింది.

టేబుల్ టెన్నిస్ ఆట మన దేశంలో 1920 ప్రాంతంలో ప్రచారంలోకి వచ్చింది. 1941వ సంవత్సరం భారత టేబుల్ టెన్నిస్ పోటీలలో విజయం సాధించిన మొట్టమొదటివారు శివరామన్. వీరు మన తెలుగువారే. డబుల్స్ పోటీలలో కూడా గెలుపొందారు. వీరికి జత ఆటగాడు శ్రీ ఎస్. ఎమ్. నాయుడు. దాదాపు ప్రపంచ ప్రమాణాన్ని అందుకున్న తెలుగువారు వి. శివరామన్, డి. వి. రెడ్డి. ప్రపంచ టేబుల్ టెన్నిస్ చరిత్రలో మన భారతదేశానికి కూడా ఒక ప్రముఖస్థానం తెచ్చిన ఘనత వీరికే దక్కింది. జె. వి. సచ్చితానందరావు అఖిలభారత ప్రమాణాన్ని అందుకున్న తెలుగువారు. 1935-45 మధ్య టేబుల్-టెన్నిస్ ఆటను ప్రచారంలోకి తెచ్చినవారిలో దుగ్గిరాల పూర్ణచంద్రరావు, ఆర్. కె. వి. రమణశాస్త్రి, విష్ణుభట్ల సుబ్బారావు, కె. నరసింహారావు

జె. రామారావు, ఏ. ఆర్. కె. మూర్తి, విజయనగరం మహారాజా, విశ్వనాథ అయ్యర్ ముఖ్యులు.

ఫుట్-బాలు ఆట మన దేశంలోనికి ప్రచారంలోకి రాగానే, మన తెలుగు వారు ఆ ఆటలోకూడా పేరు ప్రఖ్యాతులు ఆర్జించారు. 1924వ సంవత్సరం ప్రప్రథమంగా మన భారతజట్టు విదేశీపర్యటన చేసింది. కాకినాడకు చెందిన ఎమ్. అప్పారావు, ఏలూరుకుచెందిన ఏ. రహీం, రాజమండ్రికి చెందిన సుంకర హనుమంతరావు మున్నగువారు భారతదేశానికి గొప్ప పేరు సంపాదించారు. కాకినాడకు చెందిన జి. ఎస్. రాములు 1926 నుండి ఫుట్-బాలు ఆటలో కృషి చేసి 1935 వరకు భారతదేశంలోని అనేక పోటీలలో పాల్గొన్నారు. 1935 నుండి వీరు కలకత్తా "కాలిఘట్" క్లబ్‌కు ఆడారు. తర్వాత కలకత్తాకు చెందిన మహమ్మడన్ స్పోర్టింగ్‌కు ఆడి బెంగాలులో ప్రసిద్ధ ఆటగానిగా పరిగణింపబడ్డారు. తర్వాత యీస్టుబెంగాలు జట్టుకుకూడా ఆడారు. 1945లో కలకత్తా వదలి స్వగ్రామం తిరిగి వచ్చారు. వీరి తర్వాత చెప్పదగినవారు ఎమ్. అప్పారావు. వీరు 1937 నుండి 40 వరకూ కాలిఘట్ క్లబ్‌జట్టులో ఆడారు. 1941 యీస్టుబెంగాలు జట్టు సభ్యులు. అదేజట్టుకు నాయకత్వం కూడా వహించారు. 1954 సంవత్సరం ఆఫ్ఘనిస్తాన్ పర్యటించిన భారత ఫుట్-బాలు జట్టు నాయకులు. ఏలూరు వాస్తవ్యులు ఏ. రహీం 1935 నుండి కలకత్తా మహమ్మడన్ స్పోర్టింగ్‌జట్టు సభ్యులు. 1938వ సంవత్సరం ఆస్ట్రేలియా పర్యటించిన భారత ఫుట్-బాలు జట్టు సభ్యులు. బొంబాయి వై. ఎమ్. సి. ఏ. జట్టులో ఆడుతూ భారత ఖ్యాతిని ఆర్జించిన తెలుగువారు సుంకర కృష్ణారావు. మూడు సంవత్సరాలు కలకత్తా మోహన్‌బాగన్ జట్టులో ఆడారు. 1949వ సంవత్సరం భారత సైనిక దళం జట్టుకు నాయకత్వంకూడా వహించారు.

రాజమండ్రి నివాసిఅయిన డాక్టర్ సుంకరభోగారావు బొంబాయి వై. ఎమ్. సి. ఏ. ఫుట్-బాలు జట్టుకు ఆడారు. యుద్ధకాలంలో ఇటాలియన్ జట్టుతో ఆడి ప్రేక్షకుల మన్ననలను పొందారు. ఇంకా వృద్ధిలోకి రావలసిన తరుణంలో వారు ప్రమాదానికి గురై కాలు పోగొట్టుకున్నారు. పి. కన్నయ్య భారతదేశంలోని అనేక పెద్ద ఫుట్-బాలు పోటీలలో పాల్గొన్నారు. 1941 సంవత్సరం

కలకత్తా లీగ్ పోటీలలో కాలిఘట్ జట్టులో పాల్గొని పేరు సంపాదించారు. 1950 నుండి పెద్ద పెద్ద పోటీలనుండి విరమించారు. నల్లగొండ రామమూర్తి భారతదేశంలోని అనేక పోటీలలో కొంతకాలం పాల్గొని తర్వాత విరమించారు. క్రీడా పోటీలనుండి విరమించి క్రీడా ప్రచారానికి కృషి చేసారు. బర్మా, సింహళం, మలయా, హాంకాంగ్‌లు పర్యటించిన ఆర్యన్ జింఖానాక్లబ్ జట్టు మేనేజరుగా వ్యవహరించారు.

రాజధాని నగరమైన హైదరాబాదులో 1885 నుండి పుట్-బాలు ఆటకు ప్రాముఖ్యం వుంది. అప్పట్లో మెర్రిగోరౌండ్, ఎలెవెన్ హంటర్స్, వెహికల్ సబ్-డిపో, హైదరాబాదు పోలీసుజట్లు ప్రాముఖ్యం వహిస్తూ ఉండేవి. 1920 నుండి 1930 సంవత్సరాలలో హైదరాబాదు నుండి బి. కె. అయ్యంగార్, ఆఫ్తద్ అలి, అలిరజా, చిరగ్ అలీ, అబ్దుల్ మజీద్, రియాసత్, పాపయ్య, ఆంధ్ర నుండి "గన్‌షాట్" నాయుడు (వై. వి. కృష్ణారావు), గురజాల నరసింహరావు, వల్లభజ్యోసుల కృష్ణమూర్తి మున్నగువారు భారత ఖ్యాతిగాంచారు. హైదరాబాదు పుట్-బాలు సంఘం 1939 వ సంవత్సరం తురం హాదీ ఆధ్వర్యమున స్థాపించబడింది. అధ్యక్షులు కర్నల్ అలి రజా. వారి తర్వాత మొయినుద్దీన్, అజీజుద్దీన్, నూర్ మహమ్మద్, లాయక్, పాట్రిక్, ఎర్రయ్య మున్నగువారు వెలుగులోకి వచ్చారు.

అత్లెట్సులో మన తెలుగువారి కీర్తి ప్రతిష్ఠలు చాటినవారిలో ముఖ్యులు జయంతి సుధాకర రూసో. 1938-41 వరకు వాల్తేరులో చదువుతున్నప్పుడు ఆంధ్ర విశ్వవిద్యాలయ అత్లెట్సుజట్టు నాయకులు. 1945-43 సంవత్సరం మద్రాసు వై. ఎమ్. సి. ఏ. లో చదువుతున్నప్పుడు చెన్నరాష్ట్ర పోటీలలో విజయం చేబట్టారు. వ్యాయామ విద్యలో ఉన్నత శిక్షణను పొందుటకుగాను భారత ప్రభుత్వంచే ఎన్నుకోబడిన ప్రథమ తెలుగువారు వీరే. 1947-49 బ్రిటన్‌లో వుండి అత్లెట్సు, పుట్-బాలు, క్రికెట్, టెన్నిస్, బాస్కెటుబాలు మున్నగు ఆటల్లో శిక్షణ విధానములను తెలుసుకున్నారు. అనేక విదేశీ విద్యాల

యాలలో అధ్యాపకుని హోదాలో వుంటూ వివిధ క్రీడల్లో బోధనా పద్ధతులను తెలుసుకున్నారు. భారత ప్రభుత్వ ప్రతినిధిగా, అధ్యాపకుని హోదాలో 1949-52 సంవత్సరములలో అమెరికా యాత్ర వెళ్ళారు. ఇలినాయిస్ విశ్వవిద్యాలయంలో రెండున్నర సంవత్సరాలు పి. ఎచ్ డి. చేసారు. 1952వ సంవత్సరం భారత దేశం తిరిగివచ్చి అనేక శిక్షణ కేంద్రములను ఏర్పాటుచేసి, కొన్ని వేలమంది యువతీయువకులకు వివిధ క్రీడల్లో శిక్షణ యిచ్చారు.

నల్లంరెడ్డి వెంకటరామారావుగారిది గుంటూరు. 1912వ సంవత్సరం మేటి పరుగు వీరునిగా పేరొందారు. 1924 లో మద్రాసులో జరిగిన భారతీయ ఒలింపిక్స్‌లో 100 గ॥, 220 గ॥, 440 గ॥ పరుగు పందేలలో ప్రథమ స్థానం పొంది, అప్పటి చెన్నరాష్ట్ర గవర్నర్ అయిన లార్డ్ వెల్లింగ్టన్‌చే స్వయంగా యోగ్యతాపత్రాన్ని పొందారు. 1923లో ఢిల్లీలో జరిగిన మొట్ట మొదటి అఖిలభారత ఒలింపిక్స్‌కు ఎన్నికైన ప్రథమ తెలుగువారు వీరే.

ఆవుల పద్మనాభనాయుడు మద్రాసులో చదువుకునే రోజుల్లో ఆరు గ్రిగ్ పతకాలను గెలుచుకున్నారు. వీరు మద్రాసు హాకీ సంఘ పితామహులు హాకీ ఆటను దక్షిణాదిలో యీ తెలుగు వారి కృషి మూలాన్నే అగ్రస్థాయినందు కున్నది. ఉమ్మడి మద్రాసు రాష్ట్రానికి ప్రధాన వ్యాయామ విద్యాధికారిపదవిని అలంకరించిన మొదటి తెలుగు వారు వీరే.

స్వతంత్ర భారతదేశ అవతరణ పిమ్మట, 1953వ సంవత్సరంలో భారత ప్రభుత్వం ఆరోగ్య శాఖాధ్వర్యాన "రాజకుమారి స్పోర్ట్స్ కోచింగ్ స్కీమ్" ప్రారంభింపబడింది. 1950వ సంవత్సరం "నేషనల్ స్పోర్ట్స్‌క్లబ్ ఆఫ్ యిండియా" స్థాపించబడింది. అంతర్జాతీయ నిబంధనలకు అనుకూలమైన స్టేడియమ్‌లను నిర్మించడానికి యీ సంస్థ పూనుకున్నది. 1951వ సంవత్సరం జనవరి ఢిల్లీలో ఒక స్టేడియమ్ నిర్మించబడ్డది. 1951 మార్చిలో ప్రథమ ఆసియా క్రీడోత్సవాలు నిర్వహించబడినవి. ఈ సంస్థ వివిధ క్రీడల్లో శిక్షణ కేంద్రములను కూడా నిర్వహించింది. రాజకుమారి స్పోర్ట్స్ కోచింగ్ స్కీమ్ సంస్థ, నేషనల్ స్పోర్ట్స్ క్లబ్ ఆఫ్ యిండియా సహకారంతో వ్యాయామ

క్రీడల్లోనూ. ఫుట్-బాలు, హాకీ, టెన్నిస్, టేబుల్-టెన్నిస్, వాలీబాలు, బాస్కెటుబాలు వంటి ఆటల్లో ఆటగాళ్ళకు, శిక్షకులకు శిక్షణ కేంద్రములను భారతదేశం నలుమూలల నిర్వహించింది. మన తెలుగు వారైన జయంతి సుధాకిర రూసో శిక్షకులుగా నియమించ బడ్డారు. ఈ శిక్షణ ప్రణాళిక సత్ఫలితాల వల్లనే, 1954వ సంవత్సరం మనీలాలో జరిగిన ద్వితీయ క్రీడోత్సవాలకు పంపిన క్రీడాకారులకు ఉన్నత శిక్షణ యిప్పించారు. ఇందులో శిక్షణ పొందిన ముగ్గురు స్వర్ణపతకాలను సాధించారు. విజయవాడలో ప్రప్రథమంగా ఆంధ్రా అమెచూర్ అత్లెట్సు అసోసియేషన్ ద్వారా మూడు వారాలు శిక్షణ కేంద్రమును నిర్వహించారు. అదే రీతిలో 1955వ సంవత్సరం హైదరాబాదులోకూడా శిక్షణ కేంద్రమును నిర్వహించడం జరిగింది. 14, ఆగష్టు 1954 తేదీన న్యూఢిల్లీలో భారతదేశం నలుమూలలనుండి క్రీడా సంస్థల ప్రతినిధులు సమావేశమై, ఆలిండియా కౌన్సిల్ ఆఫ్ స్పోర్ట్సును నెలకొల్పారు. వివిధ క్రీడలలో శిక్షకులకు శిక్షణ యివ్వడానికి యీ సంస్థపూనుకుంది. విదేశాలకు భారత జట్లను పంపడానికి ఆర్థిక సహాయంకూడా చేసింది. ఈ సంఘ సభ్యుల సలహా వల్లనే భారతదేశమంతటికీ పాటియాలలో నేషనల్ కాలేజీ ఆఫ్ ఫిజికల్ ఎడ్యుకేషన్ నెలకొల్ప బడింది.

1956వ సంవత్సరం వివిధ క్రీడల్లో ఒక్కొక్క రాష్ట్ర, విశ్వవిద్యాలయం నుండి ప్రతినిధులను పంపి శిక్షణ యిప్పించబడింది. మనరాష్ట్రం తరపున మాధవపెద్ది జానకి రామయ్య, ఆంధ్ర విశ్వవిద్యాలయం తరపున రామారావులు శిక్షణ పొందారు. ఈ శిక్షణ కేంద్రంలో ప్రధాన శిక్షకులుగా వ్యవహరించిన టంగుటూరి అచ్యుత రామారావు మనతెలుగు వారే. బెంగుళూరులో నిర్వహించబడిన వాలీబాలు శిక్షణ కేంద్రములో ఆంధ్ర ప్రభుత్వ ప్రతినిధిగా కొసరాజు వెంకయ్య శిక్షణ పొందారు.

1955 సంవత్సరం అజ్మీర్‌లో అమెరికన్ బాస్కెటు బాలు శిక్షకులు కాఫ్‌మన్ ఆధ్వర్యమున బాస్కెటు బాలు శిక్షణ కేంద్రం నిర్వహించారు. అందులో ఆంధ్ర బాస్కెటు బాలు అసోసియేషన్ ద్వారా పానుగంటి వేణుగోపాల్

వి. సూర్యనారాయణ మూర్తి, ఆర్. పీరాజు, ఆర్. విశ్వేశ్వరరావులు పాల్గొన్నారు. కాఫ్‌మన్ హైదరాబాదులో కూడా శిక్షణ కేంద్రం నిర్వహించారు.

సమస్త క్రీడల వ్యాప్తికి నేషనల్ స్పోర్ట్సు క్లబ్ ఆఫ్ యిండియా, ఇండియన్ ఒలింపిక్ అసోసియేషన్, ఎమచూర్ అత్లెటిక్ ఫెడరేషన్ ఆఫ్ యిండియా, సర్వీసెస్ స్పోర్ట్సు కంట్రోలు బోర్డు, ఇండియన్ రైల్వేస్ అత్లెటిక్ అసోసియేషన్, యూనివర్సిటీ స్పోర్ట్సు బోర్డు సంస్థలు కృషి చేసినవి.

కేంద్ర ప్రభుత్వ ద్వితీయ పంచ వర్ష ప్రణాళికలో క్రీడాభివృద్ధికి రెండు కోట్ల రూపాయలను మంజూరు చేసింది. 1956-57వ సంవత్సరం, 30 లక్షలరూపాయలు ఖర్చుచేసింది. క్రీడల అభివృద్ధి కార్యక్రమాలకు బడ్జెటులో కొంత భాగం ప్రత్యేకించాలని కేంద్ర ప్రభుత్వం 1956 అగష్టులో రాష్ట్ర ప్రభుత్వాలకు ఆదేశం యిచ్చింది. ఆ ఆదేశం ప్రకారమే ప్రతి రాష్ట్రంలోనూ రాష్ట్ర క్రీడా సమాఖ్యలు ఏర్పడినవి. రైల్వేబోర్డు కూడ క్రీడాకారులకు సగం రైలు చార్జీల సదుపాయం కల్పించింది. భారత ప్రభుత్వం ప్రతి సంవత్సరం మేటి క్రీడాకారులను "అర్జున" బిరుదును యిచ్చి గౌరవిస్తున్నది. 1962వ సంవత్సరం ప్రప్రథమంగా 20 మంది క్రీడాగ్రేసరులకు భారత ఉపరాష్ట్రపతి డా॥ రాధాకృష్ణన్ బహూకరించారు. ఇదే మనదేశంలో క్రీడాకారులకు యిస్తున్న అత్యున్నత గౌరవం. ఈ రోజు రైల్వే, సైనికదళాలు, పోలీసు శాఖలు, బ్యాంకులు, యితర పెద్ద పెద్ద వ్యాపార సంస్థలు ఉద్యోగాలలో క్రీడాకారులకు ప్రాతినిధ్యం యిస్తున్నవి. వివిధ క్రీడలలోనూ అఖిలభారత క్రీడా సమాఖ్యలను ఏర్పరచుకొని, క్రీడారంగాభి వృద్ధికి కృషిచేస్తున్నవి.

## మన తెలుగునాడు

క్రీడారంగంలో భారత దేశ చరిత్రలో హైదరాబాదుకు ప్రముఖ స్థానం వుంది. ఆంధ్ర రాష్ట్ర అవతరణ జరగగానే రాష్ట్ర క్రీడాసంఘాలు ఏర్పడ్డవి. రాష్ట్ర పతాకం క్రింద జాతీయ పోటీలలో రాష్ట్రజట్లు పోటీ చేసినవి. 1956వ

సంవత్సరం ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడిన వెంటనే కొన్ని క్రీడల్లో ఆంధ్రా, హైదరాబాదు రాష్ట్రసంఘాలు విలీనమై, ఆంధ్ర ప్రదేశ్‌గా రాష్ట్రజట్లు జాతీయ పోటీలలో పాల్గొన్నవి. బాల్-బ్యాడ్ మింటన్, హాకీ, క్రికెట్, కబాడీ, క్యారమ్స్ మినహా అన్ని క్రీడలు ఆంధ్ర ప్రదేశ్‌గనే వ్యవహరిస్తున్నవి.

1955వ సంవత్సరం మన రాష్ట్ర ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వోద్యోగులు వివిధ క్రీడలలో పాల్గొనుటకుగాను, సంవత్సరానికి 30 రోజులు ప్రత్యేక సెలవు సదుపాయాన్ని, G. O .Ms. No. 2976. Home o/15-11-55 ద్వారా కల్గించింది.

## ఆంధ్ర ప్రదేశ్ స్పోర్ట్స్ కౌన్సిల్

అఖిలభారత స్పోర్ట్స్‌కౌన్సిలు ఆదేశంప్రకారం, మనరాష్ట్రంలో 1958 వ సంవత్సరం ఆంధ్రప్రదేశ్ స్పోర్ట్స్ కౌన్సిల్ స్థాపించ బడింది. రాష్ట్రప్రభుత్వం ఆ సంవత్సరం 30 వేల రూపాయలు మంజూరు చేసింది. 1961-62వ సంవత్సరం రెండులక్షల రూపాయలు రాష్ట్ర ప్రభుత్వం మంజూరు చేసింది. 1959-60 సంవత్సరము లు హైదరాబాదులో స్టేడియమ్ నిర్మాణానికి రాష్ట్ర స్పోర్ట్స్ కౌన్సిల్ పూనుకుంది. స్టేడియమ్ నిర్మాణానికి 30 లక్షల రూపాయలు ఖర్చయింది. రాష్ట్ర ప్రభుత్వం, మరియూ స్పోర్ట్స్ కౌన్సిల్ నిర్వహించిన లాటరీ వల్ల వచ్చిన డబ్బుతో యీ నిర్మాణం జరిగింది. మన రాష్ట్రంలో రాష్ట్ర స్పోర్ట్స్ కౌన్సిలు ఆదేశం ప్రకారం 20 జిల్లాలలోనూ, జిల్లా స్పోర్ట్స్ కౌన్సిల్సు ఏర్పాటు చెయ్యడం 1963వ సంవత్సరం జరిగింది. మొదటి సంవత్సరంప్రతి జిల్లాకు రెండు వేల రూపాయలు క్రీడాభివృద్ధికి రాష్ట్ర స్పోర్ట్స్ కౌన్సిల్ మంజూరు చేసింది. 1964-65వ సంవత్సరం అయిదువేల రూపాయిలను మంజూరు చేసింది. ప్రతి సంవత్సరం జిల్లా స్థాయిల్లో వివిధ క్రీడల్లో పోటీలను నిర్వహించమని ఆదేశించింది. జిల్లా స్పోర్ట్స్ కౌన్సిలుకు అధ్యక్షులుగా జిల్లా కలెక్టర్లు వుంటారు.

మొట్ట మొదటి సారిగా, రాష్ట్ర స్పోర్ట్స్ కౌన్సిల్ జూన్, 1964వ సంవత్సరం క్రీడాకారులకు శిక్షణ కేంద్రమును హైదరాబాదు ఫతేమైదానంలో

నిర్వహించింది. ఇందు శిక్షకులుగా ఇ. బి. అయిబరా (క్రికెట్). జె రామారావు మరియూ ఫర్కుందా ఆలీఖాన్ (టెన్నిస్), ఎస్. కరీముద్దీన్ (ఫుట్-బాలు), ముంతాజ్ (బాస్కెటుబాలు), కోదండరామయ్య (వాలీబాలు), కాజిమ్ హుసేన్ (ఈత), వి. సూర్యనారాయణ మరియూ ఎమ్. కె. రెడ్డి (అత్లెట్సు), కృషీద్ అలీ (టేబుల్-టెన్నిస్) వ్యవహరించారు.

అటువంటిది యీనాడు పెరిగి, పెద్దదై రాష్ట్ర క్రీడాభివృద్ధికి ఎనలేని సేవచేస్తున్నది. ఇప్పుడు అన్ని క్రీడలలోనూ యువతీ యువకులకు శిక్షణ యివ్వడం జరుగుతున్నది. ఇప్పుడు స్పోర్ట్సు కౌన్సిలులో 52 మంది స్పోర్ట్సు కౌన్సిల్ శిక్షకులు, 15 మంది నేషనల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ స్పోర్ట్సు శిక్షకులు, యోగవిద్యలో యిద్దరూ పనిచేస్తున్నారు. విశాఖపట్నం, ఉభయ గోదావరి, కృష్ణా, ప్రకాశం, గుంటూరు, నెల్లూరు, కర్నూలు, చిత్తూరు, ఆదిలాబాద్, కరీమ్‌నగర్, అనంతపూరు, నిజామాబాదు, ఖమ్మం, కడప, వరంగల్లు జిల్లా కేంద్రాలలో శిక్షకులు పనిచేస్తున్నారు. విద్యాసంస్థలుకాని మరే సంస్థలుకాని కోరినట్లయితే శిక్షకులను స్పోర్ట్సుకౌన్సిలు పంపిస్తుంది. ప్రస్తుతం రాష్ట్రస్పోర్ట్సు కౌన్సిలుకు అధ్యక్షులుగా పార్లమెంటు సభ్యులు ఎమ్. ఆర్. కృష్ణా, కార్యదర్శిగా ప్రసిద్ధజాతీయ అత్లెట్ మరియూ జర్మనీలో క్రీడారంగంలో శిక్షణ పొందిన ఏ. ఎస్. వి. ప్రసాద్ పనిచేస్తున్నారు. సభ్యులుగా ఆర్.డి. కతారీ, ఆర్. రామానందరావు, శివకుమార్‌లాల్, డి. సంజీవరావు, గులాం అహమ్మద్, రాజానరసింహారావు, ఎమ్ ఆర్. పాయ్, ఎమ్. ఏ. హలీమ్, కె. కృష్ణ మోహనరావు, వి. రామచంద్రన్, సి. ఎచ్. సత్యనారాయణరావు, కుడిపూడి ప్రభాకరరావు, కె.యల్. సూరి మరియూ బి. నాగేశ్వరరావు వ్యవహరిస్తున్నారు. ఈ సంవత్సరం స్పోర్ట్సు కౌన్సిలుకు ప్రభుత్వం పదిలక్షల రూపాయలు మంజూరు చేసింది. జిల్లా స్పోర్ట్సు కౌన్సిలుకు అయిదువేల రూపాయలు యిస్తున్నది. గ్రామాలలో నివసిస్తూ మరుగుపడిన క్రీడాకారులను వెలుగులోకి తెచ్చుటకు రాష్ట్రస్పోర్ట్సు కౌన్సిలు తీవ్రకృషి జరుపుతున్నది. ఆకృషిఫలితమే యీ సంవత్సరం మన తెలుగునాడుకు గ్రామవాసుల పోటీలలో జయాపజయాల పాయింట్లనుబట్టి భారతదేశం మొత్తంమీద ద్వితీయ స్థానం లభించింది.

# క్రికెట్

మన తెలుగు నాడులో ఆంధ్రా, హైదరాబాదు క్రికెట్ సంఘాలు రెండూ ప్రత్యేకం గానే వ్యవహరిస్తున్నవి. ప్రతి సంవత్సరం జరుగు రంజీ ట్రోఫీ, క్రికెట్ పోటీలలో రెండు జట్లు పోటీచేస్తున్నవి. స్వతంత్ర భారతావతరణ పిమ్మట, తెలుగునాడుకు ఎన లేని కీర్తిని తెచ్చిన వారు గులాం అహమ్మద్. వీరు హైదరాబాదు క్రికెట్ అసోసియేషన్ కు వెన్నెముక వంటివారు. 1948-49 భారతదేశం పర్యటనకు వచ్చిన వెస్టిండీస్ జట్టుతో పోటీచేసిన భారతజట్టు సభ్యులు. 1951-52 మద్రాసులో బ్రిటిష్ క్రికెట్ జట్టుపై భారత దేశం మొదటి టెస్టు విజయంపొందడానికి కారకులు వీరే. 1952 బ్రిటన్ పర్యటించి, లీడ్సు టెస్టులో 137 పరుగులకు ఏడు వికెట్లు నష్టపరిచారు. 1955-56 లో భారతదేశం పర్యటించిన న్యూజిలెండ్ జట్టుతో పోటీ చేసిన భారత జట్టు నాయకులు. 1956 ఆస్ట్రేలియాతో పోటీచేసిన భారతజట్టు సభ్యులు. తదుపరి ఉత్తమ శ్రేణి క్రికెట్ పోటీలనుండి విరమించి, హైదరాబాదు క్రికెటు సంఘానికి మరియూ భారత క్రికెటు కంట్రోలు బోర్డుకు సేవ చేస్తున్నారు. ప్రస్తుతం హైదరాబాదు క్రికెటు సంఘకార్యదర్శి, మరియూ భారత క్రికెటు కంట్రోల్ బోర్డు సహాయకార్యదర్శి. డిసెంబరు 1974 లాహోర్‌లో జరిగిన ఆసియా క్రికెటు సమావేశానికి భారత ప్రతినిధిగా పాల్గొన్నారు. రంజీట్రోఫీ :-రంజీట్రోఫీని మొట్టమొదటిసారిగా 1934 వ సంవత్సరం సిమ్లాలో జరిగిన అఖిల భారత క్రికెటు సంఘ సమావేశంలో ప్రఖ్యాత క్రికెటు యోధుడు సర్ రంజిత్ సింహజీ విభజీ నవనగర్ పేరిట నెలకొల్ప బడింది. 1890 నుండి 1904 వరకూ ప్రపంచ మేటి బ్యాట్స్‌మన్‌గా వీరు పరిగణింప బడ్డారు. ప్రప్రథమంగా ఈ ట్రోఫీ కోసం 4 నవంబరు, 1934 లో బౌలింగ్ చేసే గౌరవం మద్రాసు ఆటగాడయిన యమ్.జే. గోపాలన్‌కు దక్కింది. ఈ పోటీలోనే హైదరాబాదు ఆటగాడయిన ఎస్. ఎమ్. హాదీ, 25 నవంబరు 1934 లో 132 పరుగులు చేసి అవుటుకాలేదు. 1937-38 వ సంవత్సరం హైదరాబాదు జట్టు గెలుపొందింది.

లండన్‌లో స్థిరపడి క్రికెటు రంగంలో మన తెలుగుకీర్తి ప్రతిష్ఠతను నిలబెట్టిన వారిలో గుంటూరు వాస్తవ్యులు రామన్ సుబ్బారావు ఒకరు. వీరు

బ్యాటింగ్ ఎడమచేతితోనూ, బౌలింగ్ కుడి చేతితోనూ చెయ్యడం ఒక విశేషం. లండన్ లో 1961 ప్రఖ్యాత క్రికెట్ క్రీడాకారులుగా ఎన్నికయిన అయిదుగురు లోనూ వీరు ఒకరు. 1950 నుండి 1962 వరకూ గొప్పపేరు సంపాదించారు. వీరి సోదరులు స్టాన్లీ సుబ్బారావు కూడా మేటి క్రికెటు ఆటగాడు.

హైదరాబాదులో గులాం అహమ్మద్ తర్వాత క్రికెటు చరిత్రలో చెప్ప దగిన వారు ముద్దయ్య, ఎమ్. ఎల్. జయసింహ, పట్వాడి నవాబ్, అబ్బాస్ ఆలీబెగ్, మహేందర్ కుమార్, హబీబ్ ఖాన్, ఆబిద్ ఆలీ. ఇటీవల భారత దేశం పర్యటించి టెస్టు పోటీలలో పాల్గొనిన వెస్టెండీస్ క్రికెటు జట్టుతో పోటీ చేసిన భారత జట్టు నాయకులు నవాబ్ పట్వాడీ. భారతదేశ చరిత్రలో హైదరా బాదు జట్టుకు ప్రముఖ స్థానముంది. హైదరాబాదు క్రికెట్ అభివృద్ధికి పునా దులు వేసిన వారిలో రాజాధనరాజగిరీ, నవాబ్ మొయిన్-ఉ-దౌలా ముఖ్యులు. హైదరాబాదు నివాసి అయిన అబ్బాస్ ఆలీ బేగ్ ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయ క్రికెటు పోటీలలో గొప్పపేరు సంపాదించి, 1961 వ సంవత్సరంలో "కంట్రీ క్యాప్" సంపాదించారు. అయిదు సంవత్సరాల తర్వాత, యీ సంవత్సరం హైదరాబాదు పాఠశాలల జట్టు విజయంపొంది గులాం అహమ్మద్ ట్రోఫీను గెలుచుకున్నది.

1953 వ సంవత్సరం స్వతంత్ర ఆంధ్రరాష్ట్రం అవతరించిన పిమ్మట ఆంధ్రజట్టు రంజీట్రోఫీ పోటీలలో పాల్గొనే అవకాశం లభించింది. ఆంధ్ర క్రికెటు సంఘం ఏర్పడ్డానికి సి. కె. నాయుడు, డా॥ విజయానంద్, సి.ఎస్. నాయుడు, మంజ్రేకర్ వంటి ఉత్తమ ఆటగాళ్ళ సహాయం లభించింది. ఆంధ్ర జట్టును ప్రోత్సహించడానికి 1953, 1954 సంవత్సరములు సి.కె. నాయుడు సి.ఎస్.నాయుడు నాయకత్వం వహించి, రంజీట్రోఫీ పోటీలలో పాల్గొనచేసారు. రాష్ట్రసంఘం ఏర్పడ్డానికి కృషిచేసినవారిలో యడవల్లి అబద్దయ్య, సుబ్బయ్య పిళ్ళే, టి.రత్తయ్య, ఎస్. మస్తాన్ రావు ముఖ్యులు. ప్రస్తుతం రాష్ట్రసంఘ కార్యదర్శి పి. ఎస్. వెంకటేశ్వరరావు గట్టి కృషిచేస్తున్నారు. ఆంధ్రజట్టుకు యు. ఎస్. వి. వి. గోపాల రాజు, కొమ్మిరెడ్డి గోపాలకృష్ణ, ఆర్. వి. ఎస్.

రామారావు, కె. వి. రమణమూర్తి, జి. వి. వి. గోపాలరాజు, షఫీ బాయ్, భావరాజు వెంకటకృష్ణా రావు, ఎస్. రామారావు, ఏ. ఆర్. శ్రీధర్, ఉండవల్లి వెంకట్రావు, జి. ఆర్. పటేల్, భావన్న, చంద్ర శేఖర్, రామప్రసాద్, జి. ఎస్. ఎన్. రాజు, ఎమ్. చిత్తరంజన్, వర్మ, సి. ఎచ్. శంకర్ మున్నగువారు పేరు సంపాదించారు. అది వరలో హైదరాబాదు జట్టుకు ఆడిన మహేందర్ కుమార్, ప్రభాకరరాజు ఆంధ్రజట్టుకు ఆడారు.

## టెన్నిస్

ఆంధ్రప్రదేశ్ లాన్ టెన్నిస్ ఆసోసియేషన్‌కు భారతదేశంలో ప్రముఖ స్థానంవుంది. 1956 వరకూ ఆంధ్ర, హైదరాబాదు రాష్ట్రసంఘాలు ప్రత్యేకం గానే వ్యవహరించాయి. 1957లో కాసుబ్రహ్మానందరెడ్డి అధ్వర్యమున రెండు సంఘాలు విలీనమై, "ఆంధ్రప్రదేశ్ లాన్ టెన్నిస్ ఆసోసియేషన్"గా వ్యవ హరించబడుతున్నది. ఆ రోజులలో టెన్నిస్ ఆటలో మన తెలుగువారు ఎక్కువ సంఖ్యలో అంతర్జాతీయ ఖ్యాతిగాంచారు. ఈనాడు ఎక్కువ సంఖ్యలో ముందుకు రాలేకపోతున్నారు. ఆంధ్రప్రదేశ్ టెన్నిస్ సంఘం అవతరించిన పిమ్మట ఎస్. పి. మిశ్రా, ఎస్. ఎస్. మిశ్రా, కె. గోపాలరావు అఖిలభారత ఖ్యాతిపొందారు. భారతదేశంలో జరిగిన అనేక పెద్ద పోటీలలో పాల్గొని ఘన విజయాలు సాధించారు. ఎస్. పి. మిశ్రా భారత డేవిస్‌కప్ జట్టులో కూడా ఎన్నికైనారు. వీరితోపాటు వీరి సోదరులు ఎస్. ఎస్. మిశ్రా దేశంలోని అనేక పెద్ద పోటీలలో పాల్గొన్నారు. కె. గోపాలరావు భారతరైల్వే టెన్నిస్ ఛాంపియన్‌షిప్ గెలుచుకొని తెలుగువారికి పేరుతెచ్చారు. వీరుకూడా భారత దేశంలోని అనేక పెద్ద పోటీలలో పాల్గొని ఘనవిజయాలు సాధించారు. వీరి తర్వాత చెప్పతగినవారు ఎస్.ఎస్. మిశ్రా, టి. సత్యనారాయణ, ఎన్. శ్రీనివాస రావు. టెన్నిస్ ఆటలో ఎక్కువ మంది ఆటగాళ్ళను వెలుగులోకి తెచ్చుటకు వర్‌కుందా ఆలీఖాన్, రాజానరసింహారావు, ఆర్.కె.వి. రమణశాస్త్రి తీవ్రకృషి చేస్తున్నారు.

## టేబుల్-టెన్నిస్

మనదేశంలో 1930 సంవత్సరంనుండి ఈ ఆట ప్రచారంలోకి వచ్చింది. ఆ రోజుల్లో ప్రపంచమేటి ఆటగాళ్ళు విక్టర్‌బార్నా, బెర్లాక్‌లు మనదేశం పర్యటించి, విశేషప్రచారానికి కారకులయ్యారు. 1941 వరకూ చెక్కబ్యాట్‌లతో ఆడేవారు. దరిమిలా రబ్బరుతో తయ్యారు చేయబడిన బ్యాట్లు వినియోగంలోకి వచ్చాయి. అప్పటినుండి టేబుల్-టెన్నిస్ ఆటకు క్రొత్తమలుపు వచ్చింది. భారతదేశ మొట్టమొదటి ఛాంపియన్‌షిప్‌ను సాధించిన ఆంధ్ర ఆటగాడు శివరామన్. జె.వి. సచ్చిదానందరావు అఖిలభారతప్రమాణాన్ని అందుకున్న తెలుగువారు. ఆరోజుల్లో యీ ఆటను విశేష ప్రచారంలోకి తెచ్చింది విజయనగరం మహారాజా, పి. ఎస్. విశ్వనాథ అయ్యర్. 1946వ సంవత్సరంలో ఆంధ్ర టేబుల్-టెన్నిస్ అసోసియేషన్‌ను స్థాపించుటకు పి.ఎస్. విశ్వనాథ అయ్యర్, ఆర్. హనుమంతరావు, ఎస్. ఎస్. ఆర్. పంతులు, కె. నరసింహారావు, కృషి చేసారు. విజయనగరం మహారాజా అధ్యక్షతన ఆంధ్ర సంఘమును ఏర్పాటు చెయ్యడం జరిగింది. 1950 వ సంవత్సరం ఈ సంఘాన్ని, భారత టేబుల్-టెన్నిస్ ఫెడరేషన్ రద్దు చేసింది. ఆంధ్ర రాష్ట్ర ఆవతరణ పిమ్మట ఆర్. కె. వి. రమణ శాస్త్రి, సి. ఎస్. ఆర్. ఆంజనేయులు, బి. ఎన్. స్వామి కృషి వల్ల రాష్ట్ర టేబుల్-టెన్నిస్ సంఘం ఏర్పడింది. ఆంధ్రరాష్ట్రానికి పేరు తెచ్చినవాళ్ళలో ఆర్. కె. వి. రమణశాస్త్రి, ఏ. ఆర్. కె. మూర్తి, సి. ఎస్. ఆర్. ఆంజనేయులు, పి. వి. భుజంగరావు, బి. నరసింహస్వామి, కె. భాస్కర్ ముఖ్యులు. ఆర్. కె. వి. రమణశాస్త్రి, 1944-46 పూనా లా కాలేజ్ ఛాంపియిన్. 1950 సంవత్సరం సింహళంలో జరిగిన భారత జాతీయ, మరియు అంతర్ రాష్ట్ర టేబుల్-టెన్నిస్ ఛాంపియిన్ షిప్‌లో పాల్గొన్న ఆంధ్రజట్టు నాయకులు. సి. యస్. ఆర్. ఆంజనేయులు 1949 వ సంవత్సరం మద్రాసులో జరిగిన నాన్‌మెడలిస్టు ట్రోఫీ గెలుచుకున్న ప్రథమ తెలుగు వారు వీరు. వీరు 1950వ సంవత్సరం సింహళంలో జరిగిన పోటీలలో ఆంధ్ర ప్రతినిధిగా పాల్గొన్నారు. భుజంగరావు 1945 లో మద్రాసు ఓపెన్ టోర్నమెంటు తుదిపోటీలలో జాన్, కె. జాన్. చేతిలో ఓడి పోయారు. వీరు ప్రముఖ బ్రిటిష్ ఆటగాడయిన రెనడీ వద్ద శిక్షణ పొందారు.

హైదరాబాదు రాష్ట్రసంఘంకు భారత చరిత్రలో ప్రముఖ స్థానంవుంది. హైదరాబాదు రాష్ట్ర సంఘం 1939వ సంవత్సరం స్థాపించబడింది. సయ్యద్ సుల్తానా తన 13 వ ఏట 1949 వ సంవత్సరం జాతీయ ఛాంపియన్ షిప్ గెలుచుకున్నారు. 1951 వ సంవత్సరం ప్రపంచ పోటీలలో భారత ప్రతినిధిగా పాల్గొన్నారు. 1953 వరకూ యీమె వరుసగా అయిదు సార్లు ఛాంపియన్ షిప్‌ను సాధించారు. మళ్ళా 1955 వ సంవత్సరం విజయంపొందారు. 1956 వ సంవత్సరం కె. రామకృష్ణ భారతదేశ ఛాంపియన్‌షిప్‌ను గెలుచు కున్నారు. వీరు 1955 వ సంవత్సరం ఆఫ్ఘనిస్థాన్ పర్యటించి ఎగ్జిబిషన్ పోటీలు యిచ్చారు. టోక్యోలో జరిగిన ప్రపంచ ఛాంపియన్‌షిప్ పోటీలలో భారత జట్టు ప్రతినిధి. 1960వ సంవత్సరం హైదరాబాదులో జరిగిన జాతీయ పోటీలలో వీరికి ఆరవస్థానం లభించింది. 1963 వ సంవత్సరం జాతీయ పోటీ లలో హైదరాబాదు పురుషుల జట్టుకు ఆరవస్థానం లభించగా, జూనియర్స్ జట్టుకు ప్రథమస్థానం లభించింది. హైదరాబాదు ఆటగాడయిన మీర్ ఖాసిం ఆలీ జూనియర్స్‌లో ప్రథమస్థానం పొందారు. హయత్‌కు అయిదవ స్థానం లభించింది. 1964 ఫిబ్రవరి రెండవవారం న్యూఢిల్లీలో జరిగిన 25వ అఖిల భారత జాతీయ పోటీలలో హైదరాబాదు జూనియర్స్ జట్టు విజయంసాధిం చింది. జూనియర్‌లు మీర్‌ఖాసింఆలీ, హాయత్, యమ్. ఇక్బాల్, అశోక్ రాజ్ సెక్సానా పాల్గొన్నారు. పురుషుల జట్టులో కృషిద్ ఆలీ, ఎమ్. ఆజిమ్ ఏ. వి హనుమంతరావు, ఖాసిం ఆలీ, ఏ. వి. మోహనరావులు పాల్గొన్నారు. జూనియర్స్ వ్యక్తిగత ఛాంపియన్ షిప్‌ను మీర్ ఖాసిం ఆలీ సాధించారు. వెట రన్స్‌లో ఆంధ్ర ఆటగాడు ఏ. ఆర్. కె. మూర్తి విజయం పొందారు. 1964 సంవత్సరం హైదరాబాదు మేటి ఆటగాడయిన కృషిద్ ఆలీ పాటియాల శిక్షణ కేంద్రంలో శిక్షణ పొంది, ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ శిక్షకులుగా పనిచేస్తు న్నారు.

17 జూన్ 1964 నుండి హైదరాబాదు, ఆంధ్రజట్టు విలీనమై, ఆంధ్ర ప్రదేశ్‌గా వ్యవహరిస్తున్నది. అదే సంవత్సరం జలంధర్‌లో జరిగిన జాతీయ పోటీలలో మన రాష్ట్ర బాలుర జట్టుకు ప్రథమ స్థానం లభించింది. బాలుర

సింగిల్సు తుదిపోటీలో నిరుటి సంవత్సర విజేత మన రాష్ట్ర ఆటగాడయిన మీర్ ఖాసిం అలీని మన రాష్ట్ర మరో ఆటగాడు సుకతీ-హయత్ ఖాన్ ఓడించి ఛాంపియన్ అయ్యారు, 1965వ సంవత్సరం భారతజట్టులో సుకతీ ఎన్నికయ్యారు. అదిమొదలు యీనాటికీ భారత టేబుల్-టెన్నిస్ చరిత్రలో మన రాష్ట్రానికి ప్రముఖస్థానం వుంది. మీర్ ఖాసింఅలీ 1968, 1969లలో భారత ప్రథమశ్రేణి ఆటగానిగా, మనరాష్ట్రానికి పేరు తెచ్చారు, భారతదేశ జట్లలో మీర్ ఖాసింఅలీ, దిలీప్‌రాజ్ సెక్సానా, ఎన్. వి. అశోక్, ఏ. టి. ఎమ్. యాహ్యా భారతదేశ జట్లలో పలుమార్లు ఎన్నికై ఆసియా, మరియు ప్రపంచ టేబుల్-టెన్నిస్ పోటీలలో పాల్గొన్నారు. 1969 సంవత్సరం మొట్టమొదటిసారిగా రాష్ట్ర స్త్రీల జట్టుకు ఆరవస్థానం లభించింది.

అఖిల భారత జాతీయ పోటీలు 1943, 1949, 1960, 1972 సంవత్సరాలలో హైదరాబాదులోనూ, 1955వ సంవత్సరం గుంటూరులోనూ జరుపబడినవి. డిసెంబరు, 1965 హైదరాబాదులో భారత్, జెకొస్లవేకియా మధ్య రెండవ టెస్టుపోటీ నిర్వహించడం జరిగింది.

అంతర్జాతీయ ఖ్యాతి గాంచిన ప్రముఖ భారత రైల్వే ఆటగాళ్ళు జి.రంగనాయకులు, జి. జగన్నాథ్ మన తెలుగువారే.

## అర్జున మీర్ ఖాసిం అలీ

వీరికి టేబుల్ టెన్నిస్ఆట ప్రముఖ ఆటగానిగా గుర్తించి, భారత ప్రభుత్వం 1969వసంవత్సరం "అర్జున" బిరుదును యిచ్చి సత్కరించింది. వీరు మన రాష్ట్ర ప్రముఖ ఆటగాడు, 1964వ సంవత్సరం అఖిల భారత పోటీలలో జూనియర్స్ ఛాంపియన్. 1966వ సంవత్సరం భారత స్థాయి ఆటగాళ్ళలో మూడవ వానిగా స్థానం లభించింది, 1967వ సంవత్సరం అయిదవ స్థానం పొంది, సింగపూర్‌లో జరిగిన ఆసియా టేబుల్ టెన్నిస్ పోటీలలో పాల్గొన్నారు, 1968వ సంవత్సరం భారతదేశ ఆటగాళ్ళలో ప్రథమ స్థానం పొంది, జకార్తాలో జరిగిన 9వ ఆసియా పోటీలలో పాల్గొన్నారు. అదే సంవత్సరం 30వ ప్రపంచ టేబుల్

టెన్నిస్ పోటీలలో పాల్గొన్నారు. 1969వ సంవత్సరం కూడా భారతదేశ ఛాంపియన్. 10వ ఆసియా టేబుల్-టెన్నిస్ పోటీలలో పాల్గొన్నారు.

## హా కీ

ప్రపంచ చరిత్రలో హాకీ ఆటకు ప్రముఖస్థానం వుంది. మన తెలుగు నాడులో ఉన్నతస్థాయి ఆటగాళ్ళు ఎక్కువ సంఖ్యలో రాలేక పోతున్నారు. 7 నవంబరు 1925వ సంవత్సరం అఖిల భారత హాకీ ఫెడరేషన్ ఏర్పడ్డది. 1951 నుండి అఖిల భారత జాతీయ పోటీలు నిర్వహించ బడుతున్నవి. ఈ పోటీలకు ఆరోజుల్లో అనగా 1903వ సంవత్సరం మద్రాసులో ప్రముఖ ఆటగాడయిన కీ॥ శే॥ ఎస్. రంగస్వామి జ్ఞాపకార్థం "రంగస్వామి కప్"ను ప్రముఖ దినపత్రిక "The Hindu" అధిపతులు బహూకరించారు. 1923సంవ నుండి శ్రీరంగస్వామి మూడుసంవత్సరాలు పత్రిక ఎడిటర్‌గా పనిచేసి 1926వ త్సరం పరమపదించారు. ఆంధ్రప్రదేశ్‌లోని ఆంధ్ర, హైదరాబాదు జట్లురెండూ ప్రత్యేకంగానే జాతీయ పోటీలలో పోటీచేస్తున్నవి. హైదరాబాదు హాకీ సంఘం 1928వ సంవత్సరం స్థాపించబడింది. అప్పుడు 12 జట్లు హాకీ ఆటలో పాల్గొ నేవి. బెంగుళూరులో 1953వ సంవత్సరం జరిగిన జాతీయ పోటీలలో హైదరా బాదు జట్టు అర్ధాంతిమ పోటీవరకు నిలబడ గల్గింది. 1954, 1959, 1961 సంవత్సరములు హైదరాబాదు హాకీ సంఘం జాతీయ పోటీలు నిర్వహించింది. హైదరాబాదులో ప్రముఖ ఆటగానిగా ఒక పర్యాయం భారత జట్టులో పాల్గొన్న వారు కె. సత్యనారాయణ ఒకరే. ఆంధ్ర హాకీ సంఘం 1953వ సంవత్సరం అనంతపూరు జిల్లా, మదనపల్లెలో స్థాపించబడింది. ఆంధ్ర హాకీ జట్టు ప్రతి సంవత్సరం జాతీయపోటీలలో పాల్గొంటునే వుంది. మదనపల్లెలో అఖిల భారత త్రిలోకేకర్ స్మారక బంగారుకప్ పోటీలలో పర రాష్ట్ర జట్టు కూడా పాల్గొం టున్నవి. ఒక సంవత్సరం ప్రపంచఖ్యాతి గాంచిన ధ్యాన్‌ఛంద్‌ను పిలిపించి యువ ఆటగాళ్ళకు శిక్షణను కూడా యిప్పించారు.

గ్రామ ప్రాంతాలలో నివసించే యువకులకుగాను అఖిలభారత స్థాయిలో హాకీ పోటీలు నిర్వహించాలని అఖిల భారత స్పోర్ట్స్ కౌన్సిల్ నిర్ణయించింది.

ఈ పోటీలలో పాల్గొనేవారు 17 సం॥లోపు వారై వుండాలి. ప్రప్రథమంగా మన ఆంధ్రప్రదేశ్ స్పోర్ట్స్ కౌన్సిల్ ఆ పోటీలను నిర్వహించుటకు పూనుకున్నది. 1974వ సంవత్సరం డిసెంబరులో వరంగల్లునందు యీపోటీలు నిర్వహించబడినవి. ఆంధ్రప్రదేశ్, కర్ణాటక, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, బీహార్, మణిపూర్, అస్సాం, ఢిల్లీ మరియు పంజాబు రాష్ట్ర జట్టు పాల్గొన్నవి. ఈ జట్లను రెండు విభాగములుగా విభజించి "లీగ్" పోటీలు జరిపారు, ఒక విభాగంలో మన ఆంధ్రప్రదేశ్, యింకొక విభాగం నుండి పంజాబు జట్టు తుది పోటీకి నిలబడినవి. తుది పోటీలో ఆంధ్రప్రదేశ్ జట్టు, పంజాబును 2-1 గోలులతో ఓడించి ఛాంపియన్‌షిప్‌ను గెలుచుకున్నది. ఆటలల్లో యువకులను ప్రోత్సహించుటకుగాను ఉత్తమ ఆటగాళ్ళు ఆయిదుగురకు సంవత్సరానికి ఆరువందల రూపాయలు చొప్పున చదువుకోసం మంజూరు చేసింది. అట్లాగే రాష్ట్రస్థాయి ఆటగాళ్ళు నలుగురకు మూడువందల రూపాయలు చొప్పున ధన సహాయం మంజూరు చేసింది. మన రాష్ట్ర జట్టు విజయానికి కారణమైన రాష్ట్ర స్పోర్ట్స్ కౌన్సిలును అభినందించాలి.

## అత్లెటిక్స్

భారత దేశంలో మొట్ట మొదటి సారిగా ఒలింపిక్ ఆటలు ఢిల్లీలో 1923వ సంవత్సరం ప్రారంభించబడినవి. తర్వాత ఈ పోటీలను 1952 సంవత్సరం నుండి జాతీయక్రీడోత్సవాలుగా వ్యవహరింపబడినవి. వ్యాయామ క్రీడలు (అత్లెటిక్స్)ను ప్రచారం చేయడం నిమిత్తం 1946వ సంవత్సరం అమెచూర్ అత్లెటిక్ ఫెడరేషన్ ఆఫ్ ఇండియా స్థాపించబడింది. కేంద్ర ప్రభుత్వ సహాయంతో అన్ని రాష్ట్రాలనుండి అగ్రవ్యాయామ క్రీడా వేత్తలకు శిక్షణ కేంద్రమును నిర్వహించి, దానిద్వారా ప్రతి రాష్ట్రానికి శిక్షకులను నియమించారు. ఫెడరేషన్ శిక్షకులుగా ఉన్నత శిక్షణ పొందిన మొదటి తెలుగు వారు వి. సూర్యనారాయణ. బందరు వాస్తవ్యులైన ఎమ్. కె. రావు కుమార్తె కుమారి లీలారావు అత్లెటిక్స్‌లో అంతర్జాతీయ ఖ్యాతిగడించి తెలుగు వారికి కీర్తిని తెచ్చారు. 1956 మెల్బోర్న్ ప్రపంచ ఒలింపిక్స్‌లో పాల్గొన్న ఏకైక తెలుగు వనిత. ఈమె 100 మీ. పరుగు, 80మీ. హర్డిలు పోటీలలో పాల్గొన్నారు.

హైదరాబాదు అమెచూర్ అత్లెటిక్ అసోసియేషన్ ఏర్పరచి, యువతీ యువకులలో ప్రావీణ్యం పెంపొందించుటకు కృషిచేసినవారు పి. ఎమ్. రెడ్డి. వీరు ఉస్మానియా విశ్వవిద్యాలయ అత్లెట్సుకు శిక్షణ యిచ్చుటకుగాను జయంతి సుధాకరరూసోను పిలిపించి శిక్షణ యిప్పించారు. అట్లాగే విజయవాడలోకూడా 5 సెప్టెంబరు 1956 నుండి 26వ తేదీ వరకూ ఆంధ్ర నలుమూలల నుండి 45 మంది క్రీడాకారులను రప్పించి అత్లెట్సులో శిక్షణ యిప్పించారు.

ఆంధ్రప్రదేశ్ అవతరించగానే, ఆంధ్రప్రదేశ్ అత్లెటిక్ అసోసియేషన్ రూపొందింది. ఈ సంఘానికి కార్యదర్శిగా వి. సూర్యనారాయణ వుంటూ, అత్లెట్సులో తెలుగువారిని వృద్ధిలోకి తెచ్చుటకు తీవ్రకృషి జరిపారు. ఆంధ్ర ప్రదేశ్ స్పోర్ట్సు కౌన్సిలు ఆధ్వర్యమున హైదరాబాదు ఫోషామహల్ స్టేడియంలో 17 ఏప్రియల్ 1963 నుండి ఒక నెల రోజులు యువతీయువకులకు శిక్షణ కేంద్రము నిర్వహించబడింది. ఈ శిక్షణ కేంద్రములో ప్రధాన శిక్షకులుగా పాటియాలా నేషనల్ యిన్స్టిట్యూట్‌కు చెందిన జోసఫ్ సి. కోవాక్స్ వ్యవహరించారు. వారికి సహాయకులుగా వి. సూర్యనారాయణ పనిచేసారు. ఈశిక్షణ కేంద్రములో 25 మంది యువకులు, 15 మంది యువతులు శిక్షణ పొందారు. అదే సంవత్సరం ఆంధ్రప్రదేశ్ అమెచూర్ అత్లెట్సు అసోసియేషన్ ఆధ్వర్యమున మూడు వారాలు శిక్షకుల శిక్షణ కార్యక్రమమును నిర్వహించారు. అందు కె. ఓ. బోసన్ ప్రధాన శిక్షకులు. సహాయకులుగా వి. సూర్యనారాయణ, బి. పుల్లయ్య నాయుడు, జయరామకృష్ణన్ పనిచేసారు. ఈ శిక్షణ కేంద్రములో 20 మంది మేటి క్రీడాకారులు తిరుచ్చి, కోయంబత్తూరు, మద్రాసు, మైసూరు, ఆంధ్రప్రదేశ్ నుండి పాల్గొన్నారు. శిక్షణ అనంతరం జరిగిన పరీక్షలలో 14 మంది ఉత్తీర్ణులయ్యారు. అందు మన తెలుగువారు బి. వి. సత్యనారాయణ ఎచ్. సి. సుధాకరరెడ్డి, శ్రీమతి ఎఫ్. అస్గర్ఆలీ, కె. రంగారావు, ఆర్. యు. దీక్షిత్, రతన్‌చంద్, బి. రామాంజనేయరాజు, ఏ. వెంకటేశ్వర్లు, ఎన్. పాండు రంగారావు కలరు.

లాంగ్‌జంప్ (దూరం దూకడం)లో మద్రాసుజట్టు సభ్యులుగా జాతీయ పోటీలలో పాల్గొనిన తెలుగువారు బండాడ వెంకట సత్యనారాయణ. వీరు

లాంగ్-జంప్‌లో ప్రథమస్థానం పొంది, 1960లో రోమ్‌లో జరిగిన ప్రపంచ ఒలింపిక్స్‌లో పాల్గొన్నారు. వీరి తర్వాత చెప్పదగినవారు ఏ. ఎస్. వి. ప్రసాద్. వీరు అఖిలభారత అంతర్ విశ్వవిద్యాలయ, భారత రైల్వే మరియు జాతీయ పోటీలలో 100 మీ. 200 మీ. పరుగుపందాల్లో పాల్గొని పేరు సంపాదించి, 1967వ సంవత్సరం భారతజట్టులో ఎన్నికైనారు.

అఖిలభారత పోలీసుక్రీడల్లో 100 మీటర్ల పరుగుపందెంలో మహమ్మద్ ఖాసిం ఆసియా రికార్డును అధిగమించారు. ప్రముఖ శిక్షకులైన వి. సూర్యనారాయణ కృషివల్లనే మహమ్మద్ ఖాసిం, నాగభూషణం, ఎన్. కె. మహబూబ్, ఎమ్. ఏ. గని, వి. జోసఫ్ వంటి వారలు మన తెలుగునాడు నుండి వెలుగులోకి వచ్చారు. 1962వ సంవత్సరం హైదరాబాదులో భారత, జర్మనీ అథ్లెట్సు టెస్టుపోటీ జరిగింది. ఇందు భారత జట్టులో మన తెలుగువారు నాగభూషణం, మహమ్మద్ ఖాసిం, బి. వి. సత్యనారాయణ పాల్గొన్నారు. ఆంధ్రప్రదేశ్ జట్టుకు మహమ్మద్‌ఖాసిం నాయకత్వం వహించారు. ఎన్. వెంకటరావు, జి. సత్యనారాయణ కూడ భారత ఖ్యాతిగాంచారు.

13వ జాతీయ పోటీలు 1975 జనవరి మాసం హైదరాబాద్‌లో జరిగినవి. ఇందు పురుషుల జట్టులో మన ఆంధ్రప్రదేశ్‌కు మూడు బంగారు పతకములు లభించినవి. 5,000 మీ. 10,000 మీ. పరుగులో శివనాథ్‌సింగ్, రెండు ప్రథమస్థానములు. 3,000 మీ. స్టీపుల్‌ఛేజ్‌లో దుర్గాదాస్ ప్రథమస్థానం పొందారు. బాలుర పోటీలలో ఏడు వెండిపతకములు మన తెలుగువారికి లభించినవి. హైజంప్‌లో టి. సురేష్, డికాథలిన్‌లో నాగేశ్వరరావు, పోల్-వాల్ట్‌లో కృష్ణారావు, జావలిన్‌లో కె. బెంజిమన్, 800 మీ. పరుగుపందెంలో వై. రామారావు, పెంటాథలిన్‌లో ఆర్. బాలాజీ, లాంగ్ జంప్‌లో డి. గోపాలకృష్ణమూర్తి గార్లకు లభించినవి.

రాంచీలో గ్రామవాసులకు జరిగిన అఖిలభారత అథ్లెట్సు పోటీలలో జావలిన్‌త్రోలో శ్రీకాకుళంకు చెందిన జి. నాగేశ్వరరావుకు ప్రథమ స్థానం, షిమోగాలో 800 మీ. పరుగు పోటీలలో ప్రకాశం జిల్లాకు చెందిన బి.ఎచ్.వి. ఎన్. టాగోర్‌కు తృతీయస్థానం లభించింది.

## వాలీబాలు

ఆంధ్ర, హైదరాబాదు రాష్ట్రసంఘాలు చాలాకాలం ప్రత్యేకంగా పని చేసాయి. 1953వ సంవత్సరం ఆంధ్రరాష్ట్ర వాలీబాలు సంఘం గుంటూరులో టి. రత్తయ్య, కె. శివప్రసాద్ ఆధ్వర్యంలో స్థాపించబడింది. జాతీయ పోటీలలో పాల్గొనిన ప్రథమ ఆంధ్రరాష్ట్ర వాలీబాలు జట్టుకు కొసరాజు వెంకయ్య నాయకత్వం వహించారు. వీరు ఆంధ్రప్రభుత్వంచే ఎన్నికై, 1956వ సంవత్సరం బెంగుళూరులో కేంద్రప్రభుత్వ సహకారంతో నిర్వహించబడిన వాలీబాలు శిక్షణ కేంద్రములో ఉన్నత శిక్షణ పొందారు. వారి ఆశయం నెరవేరకముందే 1957లో స్వర్గస్థులైనారు. చేకూరి బుచ్చి రామయ్య అంతర్జాతీయ కీర్తిని గడించి తెలుగువారి గౌరవాన్ని నిలబెట్టారు. 1955వ సంవత్సరం చైనా పర్యటించిన భారత వాలీబాలు జట్టు సభ్యులు. ఈ జట్టులోనే హైదరాబాదునుండి ఖలీల్ ఎన్నికైనారు. 1956వ సంవత్సరం భారత దేశం పర్యటనకు రష్యాజట్టురాగా, ఆ జట్టుతో టెస్టుపోటీలలో పాల్గొన్న భారతజట్టు సభ్యులు. వీరు ఆట నుండి విరమించి పాటియాలా శిక్షణ కేంద్రములో వాలీబాలు ఆటలో శిక్షణ పొందారు. శిక్షణానంతరం వీరు మద్రాసు రాష్ట్రానికి వాలీబాలు శిక్షకులుగా నియమించబడ్డారు. ప్రస్తుతం పాటియాల శిక్షణ కేంద్రములో శిక్షకులుగా వుంటున్నారు. వీరి తర్వాత చెప్పదగినవారు ఏ. కోదండరామయ్య, వీరూ ఆంధ్రరాష్ట్రజట్టు, ఆటగానిగా పేరొంది, పాటియాల శిక్షణకేంద్రములో శిక్షణపొంది, యీ నాడు యువతీయువకులకు శిక్షణ ఇస్తున్నారు. వీరు జర్మనీలోకూడా కొంతకాలం వుండి వాలీబాలు ఆటలో ఉన్నత రీతులనుతెలుసుకున్నారు. వీరేగాక కంకణాల వెంకటేశ్వరరావు, సూరారెడ్డి, పి. వి. రమణారావు, ఎమ్. సుబ్బారావు, చేకూరి బలరాం మున్నగువారు భారత స్థాయినందుకున్నారు.

హైదరాబాదులో 1949వ సంవత్సరం నుండి హైదరాబాదు వాలీబాలు సంఘం నిర్వహించ బడుతున్నది. ఆదివరలో ఫరీద్ మీర్జా, జి. తిమ్మారెడ్డి, వెంకయ్య డా॥ ఆసిఫ్అహ్మద్ఖురేషీ, కర్తార్సింగ్, పి. నరసారెడ్డి, డా॥ వి. విజయ రామారావు, కె. జనార్ధనరెడ్డి, స్లీవయ్య, ఎమ్. నరసింహారెడి

మున్నగు వారు పేరొందిన ఆటగాళ్ళు. 1952 నుండి జాతీయ పోటీలు ప్రారంభించ బడ్డాయి. హైదరాబాదు జట్టు మొదటి నుండి జాతీయ పోటీలలో పాల్గొంటునేవుంది. 1961వ సంవత్సరం మద్రాసు జాతీయ పోటీలలో బాలుర జట్టు విజయం సాధించింది. 1965వ సంవత్సరం హైదరాబాదు పురుషుల జట్టు ఛాంపియన్ షిప్ సాదించింది. వనితల జట్టుకు ద్వితీయ స్థానం లభించింది. ఆతర్వాత రెండు సంఘాలు ఆంధ్రప్రదేశ్‌గా రూపొంది జాతీయ పోటీలలో ఒకే జట్టుగా పాల్గొంటున్నది. 1969వ సంవత్సరం ఆంధ్రప్రదేశ్ పురుషుల జట్టుకు ద్వితీయ స్థానం లభించగా, స్త్రీలజట్టు ఛాంపియన్‌షిప్‌ను గెలుచుకున్నది. స్త్రీల జట్టు 1967, 1968, 1973 సంవత్సరములు ద్వితీయ స్థానం పొందింది. టి. గోపాల్, ఖరీద్ సైపుద్దీన్, అసదుల్లా హుస్సేనులు భారత జట్టులో ఎన్నికై అంతర్జాతీయ ఖ్యాతి గడించారు. టి. గోపాల్ భారత జట్టు నాయకత్వం కూడా వహించారు. వీరేగాక డా॥ నందన్‌సింగ్, శ్రీనివాసరెడ్డి కూడా భారత జట్టులో ఎన్నికైనారు. స్త్రీలలో ములినీరెడ్డి, సుధా, గంగేద్కర్, వర్జీనియా రోసరీ, వీరారోసరీలు భారత జట్టులో ఎన్నికైనారు ములినీరెడ్డి భారత జట్టు నాయకత్వం కూడా వహించింది. 1963వ సంవత్సరం రష్యావాలీబాలు శిక్షకులైన పెట్రూవ్ చేయువతీయువకులకు శిక్షణ కూడా యిప్పించారు. ఆంధ్రప్రదేశ్ పోలీసు జట్టు శిక్షకులైన ఖాద్రీ యీ శిక్షణ కేంద్రంలో సహాయకులుగా పనిచేసారు. వై. వి. కృష్ణారావు, అహమ్మద్ మొహినుద్దీన్, ఎల్. వెంకట్రామ రెడ్డి, యమ్.ఆర్. కృష్ణా అఖిలభారత ఫెడరేషన్‌లో ప్రముఖకార్యకర్తలుగా పనిచేస్తున్నారు. జి. రామచంద్రారెడ్డిని భారతవాలీబాలు ఫెడరేషన్ ప్రథమ తరగతి రిఫరీగా గుర్తించింది. ప్రముఖరైల్వే ఆటగాడయిన జి. వి. బలరాం ఉన్నత క్రీడా పోటీలనుండి విరమించి, యువతీయువకులకు శిక్షణయిస్తూ, రాష్ట్రసంఘానికి కృషి చేస్తున్నారు. అఖిలభారత జట్టులో అనేక పర్యాయములు ఎన్నికైన సైనికదళం, అఖిలభారత రైల్వే ఆటగాడు జి. శ్యామసుందర్ యీ సంవత్సరం కేరళలో జరిగిన జాతీయ పోటీలలో అత్యద్భుతంగా ఆడి ప్రేక్షకులను ఆకర్షించారు. వీరు మన తెలుగువారే. స్వగ్రామం గుంటూరు, మద్రాసు రాష్ట్రంలో ప్రముఖ ఆటగానిగా భారతస్థాయినందుకున్న ఏ. రమణా రావు గుంటూరు వాస్తవ్యులు.

## "అర్జునా ములినీరెడ్డి"

శ్రీమతి ములినీరెడ్డిని వాలీబాలు ఆటలో ఉన్నత ఆటకత్తెగా భారత ప్రభుత్వంగుర్తించి, 1973వ సంవత్సరం 'అర్జునా' బిరుదునుఇచ్చి సత్కరించింది. ఈమె 2 ఆగస్టు 1945వ సంవత్సరం వరంగల్లుజిల్లాలో పుట్టారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం పట్టభద్రురాలు. అఖిలభారత విశ్వవిద్యాలయ పోటీలలో విజయం చేబట్టిన, ఉస్మానియా విశ్వవిద్యాలయజట్టు నాయకురాలు. 1963 నుండి హైదరాబాదు రాష్ట్రజట్టు ఆటకత్తె. ప్రపంచ ఒలింపిక్స్‌లో పాల్గొనుటగాను భారత జట్టులో ఎన్నికైనారు. ఒక పర్యాయం భారత వాలీబాలుజట్టు నాయకత్వంకూడా వహించారు. జాతీయపోటీలలో విజయం చేబట్టకుగాను. యీామె హైదరాబాదుజట్టులో ప్రముఖపాత్ర వహించారు. పాటియాల శిక్షణ కేంద్రంలో ఉన్నత శిక్షణపొంది, ప్రస్తుతం యువతులకు శిక్షణ యిస్తున్నారు.

## బాస్కెట్-బాలు

మనదేశంలో యీ ఆట 1904వ సంవత్సరం కలకత్తాలో ప్రారంభమయింది. ఆటను వృద్ధిలోకి రావడానికి కారకులు వై.ఎమ్.సి.ఏ. 1930 వ సంవత్సరం అలహాబాదులో జరిగిన అఖిలభారత ఒలింపిక్స్‌లో బాస్కెటు-బాలు ఆటను ప్రవేశపెట్టారు. ఫిబ్రవరి, 1950 బొంబాయిలో సి.సి. అబ్రహం అధ్యక్షతన అఖిలభారత బాస్కెటు-బాలు ఫెడరేషన్ స్థాపించబడింది. ప్రథమ అఖిలభారత జాతీయ బాస్కెటు-బాలు పోటీలు 1951 సంవత్సరం లూధియానాలో జరుపబడినవి. 1955 లో కాఫ్మన్, 1956లో శాంమ్ ఫాక్స్ అనే అమెరికన్ శిక్షకులు భారతదేశంలోని కొన్ని ముఖ్యపట్టణాలలో శిక్షణ కేంద్రములను నిర్వహించి, అనేకమంది ఆటగాళ్ళకు, శిక్షకులకు శిక్షణ యిచ్చారు. మన రాజధాని నగరమైన హైదరాబాదులో 1955వ సంవత్సరం ఆరవ జాతీయపోటీలు, 1961 సంవత్సరం 12వ జాతీయ పోటీలు నిర్వహించబడినవి.

హైదరాబాదులో మొట్టమొదటిసారిగా బాస్కెటుబాలు ఆటను 1919వ సంవత్సరం విక్టరీ ప్లే గ్రౌండులో ప్రారంభించబడింది. 1930వ సంవత్సరం

మొదటిసారిగా బాస్కెటుబాలు పోటీలు హైదరాబాదులో జరిగినవి. 17 మార్చి 1948వ తేదీన బి. అనంతరావు ఆధ్వర్యమున హైదరాబాదు బాస్కెటుబాలు సంఘం స్థాపించబడింది. 1952 డిసెంబర్ మైసూరులో జరిగిన జాతీయ పోటీలలో హైదరాబాదు జట్టు పాల్గొన్నది. 1955వ సంవత్సరం హైదరాబాదు స్త్రీలజట్టు జాతీయ పోటీలలో విజయం చేపట్టగా, బాలురజట్టు ద్వితీయస్థానం పొందింది. 1956వ సంవత్సరం హైదరాబాదు బాలురజట్టు విజయం చేపట్టగా, హైదరాబాదు వనితల జట్టుకు ద్వితీయస్థానం లభించింది.

1951-52వ సంవత్సరం వరకు ఆంధ్రరాష్ట్రంలో బాస్కెటుబాలు ఆటకు ఎక్కువ ప్రాముఖ్యం లేదు. అమలాపురం వాస్తవ్యులైన విత్తనాల వెంకటేశ్వరరావు మద్రాసులో వున్నప్పుడు బాస్కెటుబాలు ఆట ఆధునిక పద్ధతులను తెలుసుకొని, ఆంధ్రలో ప్రచారానికి తెచ్చారు. 2 ఫిబ్రవరి 1954న ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులుగారు ప్రధాన పోషకులుగా, విజయవాడలో రాష్ట్ర బాస్కెటుబాలు సంఘం స్థాపించబడింది. దానికి అధ్యక్షులుగా పసల సూర్యచంద్రరావు, కార్యదర్శిగా పానుగంటి వేణుగోపాల్ ఎన్నికయ్యారు. మొదటి రాష్ట్రపోటీలు విజయవాడలో 1954వ సంవత్సరం జరిగినవి. ప్రథమ పర్యాయం ఆంధ్రజట్టు ఢిల్లీలో జరిగిన అఖిలభారత బాస్కెటు-బాలు పోటీలలో పాల్గొన్నది.

24 ఫిబ్రవరి 1957 విజయవాడలో ఆంధ్ర, హైదరాబాదు సంఘ ముఖ్య కార్యకర్తలు సమావేశం జరిపి, ఆంధ్రప్రదేశ్ బాస్కెటు-బాలు సంఘంగా రూపొందించడం జరిగింది. బాస్కెటు-బాలు ఆటను విశేషప్రచారం జరుపుటకుగాను ఆంధ్ర, హైదరాబాదు సంఘాలుకూడా ప్రత్యేకంగానే ఆచరణలో వున్నవి. జాతీయ పోటీలలోనూ భారత బాస్కెటుబాలు ఫెడరేషన్ సమావేశాలతోనూ ఆంధ్రప్రదేశ్‌గనే వ్యవహరిస్తున్నది. 1961వ సంవత్సరం హైదరాబాదు, 1965 సంవత్సరం కోయంబత్తూరులో జరిగిన జాతీయ పోటీలలో ఆంధ్రప్రదేశ్ బాలురజట్టుకు ద్వితీయస్థానం లభించింది.

10 నవంబరు నుండి 3 డిసెంబరు 1958 వరకూ రంగూన్; పెనాంగ్, సింగపూర్ మరియు హాంకాంగ్ పర్యటించిన అఖిలభారత వై. ఎమ్. సి. ఏ.

జట్టులో ఆంధ్రప్రదేశ్ నుండి సి. పున్నరాజ్, డి. ఆర్. నందా, సి. శ్రీనివాసన్‌లు వున్నారు. పాకిస్తాన్ వై. ఎమ్. సి. ఏ. జట్టు భారతదేశం పర్యటించిన సందర్భంగా హైదరాబాదులో ఒక పోటీనిర్వహించబడింది. 1960 సంవత్సరం భారత బాస్కెటు-బాలు జట్టు ఎన్నికచేయబడిన సభ్యులలో ఆంధ్రనుండి పానుగంటి వేణుగోపాల్‌కు అవకాశం కల్గింది. ఆ స్థానం అలంకరించిన ప్రథమ ఆంధ్రులు వీరే.

1962 వరకూ, బాస్కెటు-బాలు ఆట అంతగా ప్రావీణ్యం లేకుండుటచే మన భారతజట్టును బయట పోటీలకు పంపలేదు. కాని ప్రతి సంవత్సరం భారత మేటి ఆటగాళ్ళను ఎన్నికచెయ్యడం మాత్రం జరుగుతూనే వుంది. మన తెలుగునాడు నుండి ఆర్. వీరరాజు, డి. పి. ఎలియాస్, అబుల్‌కరీం, పి. అబ్బులు, డి. ఆర్. నందా, టి. రవికాంత్, సి. శ్రీనివాసన్, షంషుద్దీన్, శ్యామ్‌లక్, విలియమ్‌లక్, ఎమ్. గోవర్ధన్, ఆలీపాషా, ముస్తాఫా కమల్ మున్నగువారు ఎన్నికయ్యారు. 1962వ సంవత్సరం లాహోర్‌లో జరిగిన క్వాడ్రాంగ్యులర్ బాస్కెటు-బాలు పోటీలలో మన భారతజట్టు విజయం చేపట్టింది. 1965 మలేసియాలో జరిగిన మూడవ ఆసియా బాస్కెటు-బాలు పోటీలలో మన భారతజట్టు మంచిపేరు సంపాదించింది. అఖిలభారత ఫెడరేషన్ ప్రథమ తరగతి రిఫరీలుగా మన తెలుగునాడు నుండి సంపత్‌కుమార్, ఎస్. శంకరన్, ముంతాజ్, ఎస్. వివేకానందా, డి. త్యాగరాజన్, రెండవ తరగతి రిఫరీలుగా వేణుగోపాల్, వాల్టర్‌డానియల్, శామ్యూల్ మార్క్ వ్యవహరిస్తున్నారు.

బాస్కెటు-బాలు ఫెడరేషన్ సహాయ కార్యదర్శిగా సంపత్‌కుమార్ చాలా సంవత్సరముల నుండి వ్యవహరిస్తున్నారు. వీరు భారత జట్టు ఎన్నికల సంఘ సభ్యులు కూడా. భారత బాస్కెటు-బాలు జట్టు మానేజరుగా కూడా వ్యవహరించారు.

బాస్కెటు-బాలు ఆటలో అంతర్జాతీయ ఖ్యాతిని తెచ్చిన తెలుగువారు మాత్యూస్ సత్యబాబు. వీరిదిగుంటూరు. చాలాకాలంనుండి మద్రాసు లోనిఐ. సి.

ఎఫ్. లో పనిచేస్తూ భారత రైల్వే జట్టుకు ప్రముఖ పాత్ర వహించారు. భారత దేశంలోని అనేక పెద్ద పోటీలలో వీరి నాయకత్వం క్రింద ఘన విజయాలు సాధించారు. అఖిల భారత జట్టులో పలుమార్లు ఎన్నికై, ఒకపర్యాయం భారత జట్టుకు నాయకత్వం కూడా వహించారు. తర్వాత పి. వి. రమణారావు, మహమ్మద్, యాదగిరి, వహీద్ పాషా మున్నగు వారు కూడా భారత ప్రమాణాన్ని అందుకున్న మేటి ఆటగాళ్ళు.

మన తెలుగు నాడు నుండి భారత ఫెడరేషన్‌లో ప్రథమ తరగతి రిఫరీగా వ్యవహరించే డి. త్యాగరాజన్‌ను అంతర్జాతీయ పోటీలకు రిఫరీగా ఎన్నికైనారు.

## ఫుట్-బాలు

ఆంధ్ర ప్రదేశ్ అవతరించిన కొన్ని సంవత్సరాల తర్వాత ఆంధ్రా, హైదరాబాదు రాష్ట్ర సంఘాలు విలీనమై ఆంధ్రప్రదేశ్ ఫుట్ బాలు సంఘంగా రూపొందింది. మన భారతదేశంలో ఆంధ్ర ప్రదేశ్‌కు ప్రముఖ స్థానం వుంది. ఆంధ్ర రాష్ట్ర అవతరణ జరగగానే 1953, సెప్టెంబరు, 21వ తేది ఆంధ్రరాష్ట్ర ఫుట్-బాలు సంఘం దేవత రామ మోహనరావు, ఎమ్. వి. కృష్ణ, ఎమ్. రామకృష్ణారావు, డా॥ ఎస్. రామచంద్రరావు, సుంకర భాస్కరరావుల ఆధ్వర్యంలో రాజమండ్రిలో స్థాపించబడింది. మొట్ట మొదటి సారిగా ఆంధ్ర జట్టు, ప్రముఖ అఖిల భారత ఆటగాడయిన సుంకర హనుమంతరావు నాయకత్వన సంతోష్ ట్రోఫీపోటీలలో పాల్గొన్నది. హైదరాబాదు జట్టుకు మాత్రం మొదటి నుండి మంచి పేరు వుంది. అనేక అఖిల భారత పోటీలలో ఘన విజయాలు సాధించింది. మద్రాసు ఎమ్. యు. సి. ఫుట్-బాలు పోటీలలో హైదరాబాదు ఎలెవెన్, హైదరాబాదు వెహికల్ డిపోజట్టు 1950 నుండి 54 వరకూ విజయాలు సాధించినవి. అదే పోటీలలో నెల్లూరు రైజింగ్ స్టార్స్ జట్టు, 1943వ సంవత్సరం గెలుపొందింది. అజట్టులో వి. రంగారావు, భద్రయ్య, రామమోహనరావు పేరు ప్రఖ్యాతులు గడించారు. 1911వ సంవత్సరం స్థాపించబడిన విశాఖపట్నం పోలార్‌స్టార్స్ జట్టు 1957వ సంవత్సరం ద్వితీయ స్థానం పొందింది.

అఖిల భారత ఫుట్-బాలు ఫెడరేషన్ 23, జూన్ 1937 సిమ్లాలో స్థాపించ బడింది. 1940 నుండి అఖిల భారత జాతీయ పోటీలు ప్రారంభ మయ్యాయి. 1941 నుండి సంతోష్‌కు చెందిన మన్ మత్‌రాయ్ చౌదరి స్మారక చిహ్నంగా "సంతోష్ ట్రోఫీ"ని ప్రవేశ పెట్టారు. మన దేశంలోని అతి ముఖ్య మైన ఫుట్-బాలు పోటీలు ఢిల్లీలో 'డూరాండ్ కప్' 1888వ సంవత్సరంలోనూ బొంబాయిలో 'రోవర్స్ కప్' 1891 లోను, మద్రాసు ఐ. ఎఫ్. ఏ. షీల్డు 1893 లోనూ ప్రారంభమయినవి.

హైదరాబాదు సంఘానికి ఎస్. ఏ. రహీం ఎనలేని సేవ చేసారు. వీరి కృషి వల్లనే హైదరాబాదు జట్టు భారతదేశంలో ప్రముఖ స్థానం ఆక్రమిం చింది. జాతీయ పోటీలలో హైదరాబాదు జట్టు 1949,50 సంవత్సరములు ద్వితీయ స్థానం పొందింది. 1926, 57, 58, 1966వ సంవత్సరములు విజయం సాధించింది. రహీం శిక్షణ వల్లనే హైదరాబాదు నుండి జుల్ఫికర్, అజీజ్, మొయిన్, నూర్, లాయక్, యూసూఫ్‌ఖాన్, కన్నన్, బలరాం, హకీమ్, హమీద్, రహిం, సాలెహ్ వంటి ప్రముఖ ఆటగాళ్ళు అంతర్జాతీయ ఖ్యాతి గడించారు. రహీంను గొప్ప శిక్షకునిగా భారత ఫుట్-బాలు ఫెడరేషన్ గుర్తిం చింది. అటువంటి గొప్పవ్యక్తి 11, జూన్ 1963వ సంవత్సరం పరమపదిం చారు చాలమంది మనతెలుగువారు పరరాష్ట్రిలలో నివాస మేర్పచుకొని, తెలుగు వారి కీర్తిని విస్తరింప చేసారు. అటువంటి వారిలో తంగరాజ్, అప్పలరాజు, వరహాలు, జి. రాధాకృష్ణ, వి. హనుమంతరావు, వి. వి. కృష్ణమూర్తి. ఎమ్. ఆంతోనిదాస్, రెడ్డి, షమ్మి అహమ్మద్ మున్నగు వారు కలరు. వీరిలో అప్పల రాజు, వరహాలు భారత ఫుట్-బాలు జట్టుకు నాయకత్వం కూడా వహించారు. అజీజుద్దీన్ భారత జట్టులో 22 పర్యాయములు ఎన్నికై, అనేక పోటీలలో మేటి ఆటగానిగా పరిగణింప బడ్డారు. రహీం మరణానంతరం ప్రముఖ ఆటగాడు జి. ఎమ్. పెంటయ్యను ప్రముఖ శిక్షకునిగా భారత ఫెడరేషన్ గుర్తించింది. భారత ఫుట్-బాల్ జట్టుకు శిక్షకులుగా కూడా నిర్వహించారు. ఫుట్-బాలు ఆటలో వున్నతరీని తెలుసుకొనుటకు, జర్మనీ కూడా వెళ్ళివచ్చారు. వీరు ఆంధ్రప్రదేశ్ పోలీసు జట్టుకు, మరియు ఆంధ్రప్రదేశ్ తంతి-తపాలా జట్టుకు

శిక్షకునిగా కూడా ఎన్నికైనారు మన రాజధాని నగరంలో ప్రతి సంవత్సరం జరుగు నిజాం బంగారుకప్ ఫుట్-బాలు పోటీలలో భారతదేశనలు మూలలనుండి ప్రముఖ జట్లు పాల్గొంటున్నవి.

## "అర్జునా" టి. బలరాం

వీరికి 1962 వ సంవత్సరం "అర్జునా" బిరుదు లభించింది. వీరివయస్సు 39 సంవత్సరాలు. హైదరాబాదు వాస్తవ్యులు. 1955,56 ఆంధ్రప్రదేశ ఫుట్-బాలు జట్టు సభ్యులు. 59 నుండి 62 వరకూ బెంగాల్ జట్టుకు ఆడారు. అఖిలభారత జాతీయ పోటీలలో విజయంపొందిన బెంగాలు జట్టు నాయకులు, భారతదేశ ఫుట్-బాలు జట్టులో అనేక పర్యాయములు ఎన్నికైనారు. జకార్తాలో జరిగిన ఆసియాక్రీడోత్సవంలో పాల్గొన్న భారతజట్టు సభ్యులుగా వుండి, మనదేశం బంగారు పతకం పొందుటకు కారకులైనారు.

## "అర్జునా" యూసఫ్ ఖాన్

హైదరాబాదు నివాసి. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ పోలీసు శాఖలో పని చేస్తున్నారు. వీరికి 1966 వ సంవత్సరం "అర్జునా" బిరుదు లభించింది. చాలా సంవత్సరాలు ఆంధ్రప్రదేశ జట్టు సభ్యులుగా, నాయకులుగా జాతీయ పోటీలలో పాల్గొన్నారు. పలు సార్లు భారతజట్టులో ఎనికైనారు. 1966 లో ఆసియా ఫుట్-బాలు జట్టులో భారతదేశ జట్టునుండి ఎన్నికైనారు.

## "అర్జునా" తంగ రాజ్

వీరి స్వస్థలం హైదరాబాదు. 1961 వరకూ సైనికదళంలో పని చేస్తూ సైనికదళం జట్టుకు ఆడారు. 1962 నుండి బెంగాలు జట్టుకు ఆడారు. మెల్బోర్న్‌లో జరిగిన ప్రపంచ ఒలంపిక్స్‌లో పాల్గొన్న భారత జట్టు గోల్ కీపర్. సైనిక్ దళం జట్టుకు నాయకత్వం కూడా వహించారు. అనేకపర్యాయములు భారత జట్టులో ఎన్నికైనారు. వీరికి 1967 వ సంవత్సరం "అర్జునా" బిరుదు లభించింది.

## "అర్జునా" నయీముద్దీన్

వీరిది హైదరాబాదు. 1961 నుండి 1966 వరకూ ఆంధ్రప్రదేశ్ పోలీసు జట్టు సభ్యులుగా ఉన్నారు. మొట్టమొదటి ఆసియా యువకుల ఫుట్-బాలు పోటీలలో పాల్గొన్న భారత జట్టు నాయకులు. 1964 నుండి 1972 వరకూ అనేకపర్యాయములు భారత జట్టులో ఎన్నికయ్యారు. జకార్తా ఒలింపిక్స్‌లో పాల్గొన్న భారతజట్టు నాయకులు. 1966 నుండి కలకత్తా మహమ్మదన్ స్పోర్టింగ్ జట్టుకు ఆడుతున్నారు. వీరి వయస్సు 30 సంవత్సరాలు. భారతప్రభుత్వం "అర్జునా" బిరుదును యీమేటి ఆటగానికి 1970 సంవత్సరం యివ్వడం జరిగింది.

## చదరంగం

మన భారతదేశంలో అతిప్రాచీనమైన యీ ఆటకు ఎక్కువ ప్రాముఖ్యం లేకుండా పోయింది. 1951వ సంవత్సరం అఖిలభారతచెస్ ఫెడరేషన్ స్థాపనతో. మనదేశంలో యీ క్రీడకు ప్రాముఖ్యత వచ్చింది. హైదరాబాదు రాష్ట్ర సంఘం 1950వ సంవత్సరం నెలకొల్పబడింది. 1956వ సంవత్సరం మార్చి నెలలో 26 దేశాలకు జరిగిన చదరంగం (కరస్పాండెంట్) పోటీలలో 70మంది ఆటగాళ్ళు పాల్గొన్నారు. ఈ పోటీలలో మనతెలుగువారు జి.ఎస్. దీక్షిత్ పాల్గొన్నారు. అదే సంవత్సరం ఆగస్టునెల మాస్కోలో జరిగిన ప్రపంచ పోటీలలో పాల్గొనుటకు భారతజట్టులో జి.ఎస్. దీక్షిత్, దర్భా వెంకయ్య ఎన్నికైనారు. అనివార్యకారణాలవల్ల పాల్గొనలేదు. 1959వ సంవత్సరం జరిగిన అఖిలభారత జాతీయ పోటీలలో హైదరాబాదు ఆటగాడైన హుస్సేన్ ఆలి ద్వితీయ స్థానం పొందగా, జి.ఎస్. దీక్షిత్‌కు ఆదరస్థానం లభించింది. 1961వ సంవత్సరం హైదరాబాదులో నాల్గవ జాతీయ ఛాంపియన్‌షిప్ పోటీలు జరిగినవి. ఇందులో హైదరాబాదు ఆటగాళ్ళయిన ఫరూక్ ఆలీ తృతీయ స్థానం, మహమ్మద్ హాసన్ చతుర్థ స్థానాన్ని పొందారు. 1962-63 బల్గేరియాలో జరిగిన ప్రపంచపోటీలలో హైదరాబాదు ఆటగాళ్ళు మహమ్మద్ హాసన్, ఫరూక్ ఆలీలు భారతజట్టులో ఎన్నికైనారు. ఫిబ్రవరి, 24 1964వ తేదీ రష్యా ప్రసిద్ధ

ఆటగాళ్ళు హైదరాబాదు రావడం జరిగింది. ఆంధ్ర ఆటగాడయిన ఆర్.వి.ఎస్. మూర్తి, యూరి అరచేక్‌తో ఆడి "డ్రా" చేసారు. రష్యాజట్టుతో ఆంధ్రప్రదేశ్ నుండి బాపిరాజు, ఫరూక్ ఆలీ, మహమ్మద్ హాసన్, తురబ్‌ఆలీ, రెంటాల సుబ్రమణ్యం పోటీచేసారు.

1970వ సంవత్సరం ఆంధ్రప్రదేశ్ చదరంగ అసోసియేషన్ ఏర్పడింది. అప్పటినుండి ఆంధ్రప్రదేశ్ జట్టుగానే జాతీయపోటీలలో పాల్గొంటున్నది. జాతీయ పోటీలలో ఆంధ్రప్రదేశ్ ఆటగాళ్ళు హసన్ 1971,72 సంవత్సరాలలో ద్వితీయ స్థానం 1973,74 సంవత్సరములు చతుర్థస్థానం పొందగా, గాలీబ్ 1971,1972వ సంవత్సరములు చతుర్థస్థానాన్ని పొందారు. అఖిలభారత ఫెడరేషన్‌లో ఢిల్లీ సంఘంనుండి, మన ఆంధ్రులయిన కే.వి. రమణమూర్తి 1967లో కార్యదర్శి, 1973వ సంవత్సరంనుండి ఉపాధ్యక్ష పదవులను నిర్వహిస్తున్నారు. ఫెడరేషన్ సభ్యులుగా గాలీబ్ ఆంధ్రప్రదేశ్‌నుండి వ్యవహరిస్తున్నారు.

## బాడ్మింటన్ (షటిల్)

బాడ్మింటన్ ఆట చాలాకాలంనుండి ఫ్రాన్సులో ప్రచారంలోవుంది. 17వ శతాబ్దంలో ఇంగ్లండ్‌లో యీ ఆట ప్రచారంలోకి వచ్చింది. నియమాలతో కూడిన బాడ్మింటన్ 1874 నుండి ప్రారంభమయింది. 1898లో ఇంగ్లండ్‌లో బాడ్మింటన్ అసోసియేషన్ స్థాపించారు. మొదటిసారిగా 1899లో ఇంగ్లండ్‌లో చాంపియన్‌షిప్ పోటీలు ప్రారంభమయినవి.

భారత బాడ్మింటన్ ఫెడరేషన్ 1934వ సంవత్సరం స్థాపించబడింది. మన భారతదేశం తొలిసారిగా 1950లో థామస్‌కప్ పోటీలలో పాల్గొన్నది. ఆంధ్రప్రదేశ్ అవతరించకముందు హైదరాబాదులో యీ ఆట ప్రచారంలోనే వుంది. 1952వ సంవత్సరం మద్రాసు బాడ్మింటన్ ఛాంపియన్‌షిప్‌ను హైదరాబాదు ఆటగాడు దస్తగిరి గెలుచుకున్నారు.

అఖిలభారత జాతీయపోటీలు 1934వ సంవత్సరం కలకత్తాలో ప్రారంభమయినవి. 1957, 1971వ సంవత్సరములు హైదరాబాదులో జరిగినవి.

1966వ సంవత్సరం ఆసియా జోన్ పోటీలు, జపాన్, తాయిలాండ్, భారత దేశాలమధ్య హైదరాబాదులో నిర్వహించబడినవి. 1961వ సంవత్సరంలో జరిగిన జాతీయపోటీల జూనియర్స్‌లో ఆంధ్రప్రదేశ్‌నుండి జహూర్-ఉల్-హుస్సేన్ ఛాంపియన్‌షిప్ సాధించారు. యువతులలో ఆంధ్రప్రదేశ్‌నుండి నారికపాద, జెస్సీఫిలిప్స్, గ్రేస్‌షోర్‌లు భారతదేశ ఖ్యాతిని పొందగల్గే అవకాశాలు వున్నవి. బాడ్మింటన్ ఫెడరేషన్‌లో ఆంధ్రప్రదేశ్‌నుండి అహమ్మద్ హుస్సేన్ కోశాధికారి పదవిని నిర్వహిస్తున్నారు.

## కబాడీ

ఇది మన భారతీయ క్రీడ. అదివరలో "చెడుగుడు" ఆటగా మన తెలుగు నాడులో విశేష ప్రచారంలో వుండేది. సూర్యదేవర అంకినీడు "చెడుగుడు పితామహ" బిరుదు పొందారు. చివరి దశలో అందులయిన వీరికి రాష్ట్ర ప్రభుత్వం గ్రాంటునుకూడా మంజూరు చేసింది. ఆ రోజుల్లో దాసరి రాములు, దాసరి శీతారామయ్య, హబీబ్, తిలక్, ధనుంజయ, గడిపాటి అంజయ్య, ముదిగొండ లింగమూర్తి (సినీ అర్టిస్టు), సంతాపాచారి మున్నగువారు చెడుగుడు ఆటలో పేరొందారు. ఆ తర్వాత "కబాడీ" ఆటగా రూపొందింది. 1952వ సంవత్సరం మొట్టమొదటి సారిగా మద్రాసులో ప్రథమజాతీయ కబాడీ పోటీలు నిర్వహించబడినవి. ఈ పోటీలలో మద్రాసుజట్టు విజయం పొందింది. విజయం పొందిన మద్రాసుజట్టు నాయకత్వం వహించింది మనతెలుగువారు పడమటి చంచయ్య, ఈ జట్టులో ఒక్కరు మినహా అందరూ తెలుగువారే. స్త్రీలపోటీలు 1955 నుండి కలకత్తాలో జరిగిన నాల్గవ జాతీయ పోటీలలో ప్రవేశపెట్టబడింది. అయిదవ జాతీయ పోటీలు 1956లో హైదరాబాదులోనూ, తొమ్మిదవ జాతీయ పోటీలు 1960లో విజయవాడలోనూ, 14వ, 20వ జాతీయపోటీలు హైదరాబాదులోనూ నిర్వహించబడినవి. ఈ సంవత్సరం సేలంలో జరిగిన 23వ జాతీయ పోటీలలో హైదరాబాదు బాలురజట్టుకు ద్వితీయస్థానం లభించింది. అఖిల భారత తంతి-తపాలా శాఖజట్టులో మన తెలుగువారు జాని, బి. యాదగిరి, జి వాసుదేవ్, సత్యనారాయణ, సయ్యద్ నజీరుద్దీన్, యజాజ్-ఉల్లా-గోరీ వున్నారు. శిక్ష

కులు కె. హరిదర్శన్, అఖిలభారత రైల్వేజట్టులో మన తెలుగువారు సి. చెన్నగిరి పాల్గొన్నారు. అమెచూర్ కబాడీ ఫెడరేషన్ ఆఫ్ యిండియా ప్రధాన కార్యదర్శిగా హైదరాబాదు రాష్ట్రసంఘ అధ్యక్షులైన టి. రాజగోపాలాచారి వ్యవహరిస్తున్నారు. మద్రాసు, ఆంధ్రా, హైదరాబాదు కబాడీ జట్టులో ప్రముఖపాత్ర వహించిన వై. సత్యనారాయణ (కనుమూరి సత్యం) 1960వ సంవత్సరం అమెరికాలో వున్నప్పుడు అమెరికా జాతీయ బంగారుపతకమును పొందారు. వీరు 15 రకాల క్రీడలలో ఉత్తీర్ణులయ్యారు. ఈ గౌరవం పొందిన ప్రథమ తెలుగువారు, భారతీయుడు వీరే. పాటియాల శిక్షణ కేంద్రములో కబాడీ ఆట శిక్షణను 1973 చందా హుస్సేన్, 1974లో శంకర్‌గౌడ్ యిచ్చారు. వీరిద్దరూ హైదరాబాదు కబాడీ సంఘానికి చెందినవారు. క్రిందటి సంవత్సరం బంగ్లాదేశ్ పర్యటించిన మన భారత జట్టులో ఆంధ్రానుండి కోటేశ్వరరావు, హైదరాబాదునుండి యజాజ్-ఉల్లాగోరీవున్నారు. భారతజట్టుఎన్నికల సంఘసభ్యులుగా హైదరాబాదు నుండి ఓంకార్ ప్రసాద్‌ను నియమించారు. జాతీయపోటీలలో ప్రథమ తరగతి రిఫరీలుగా హైదరాబాదునుండి ఫకీర్ అహమ్మద్, చందాహుస్సేన్, ఓంకార ప్రసాద్, జయశంకర్‌గౌడ్, ఆంధ్రానుండి సాంబయ్య వ్యవహరిస్తున్నారు. ఈ సంవత్సరం షిమోగాలో జరిగిన అఖిలభారత గ్రామవాసుల కబాడీ పోటీలలో ఆంధ్రప్రదేశ్ బాలురజట్టుకు అయిదవస్థానం, బాలికలజట్టుకు మూడవస్థానం లభించింది.

## హాండ్-బాలు

ఈ ఆట విదేశాలలో చాలా సంవత్సరాలనుండి ప్రచారంలో వుంది. ఇటీవల జరిగిన ఒలింపిక్స్‌లో 16 దేశాల జట్టు యీ పోటీలలో పాల్గొన్నవి. ఇప్పుడిప్పుడే మన దేశంలో కూడా ప్రచారంలోకి వస్తున్నది. మొట్ట మొదటి అఖిల భారత జాతీయ పోటీలు 1972వ సంవత్సరం హర్యానాలో జరిగినవి. అందు మన ఆంధ్రప్రదేశ్ జట్టుకు ద్వితీయస్థానం లభించింది.

మన రాష్ట్ర రాజధాని నగరంలో ఆంధ్రప్రదేశ్ హాండ్-బాలు అసోసియేషన్ 28, ఏప్రియల్ 1972వ సంవత్సరం స్థాపించబడింది. భారత

హాండ్-బాలు ఫెడరేషన్‌లో సీనియర్ ఉపాధ్యక్షులుగా, మన రాష్ట్ర మంత్రి వర్యులు డి. మునుస్వామి, ఉపాధ్యక్షులుగా సయ్యద్ చందాహుస్సేన్, కోశాధికారిగా మహమ్మద్ యిబ్రహింఖాన్ వ్యవహరించారు. రెండవ జాతీయ పోటీలు ఫిబ్రవరి, 1. 1973 నుండి ఆంధ్రప్రదేశ్ హండ్-బాలు అసోసియేషన్ ఆధ్వర్యమున హైదరాబాదులో జరిగినవి. ఈ పోటీలలో పశ్చిమబెంగాల్, విదర్భ, మహారాష్ట్ర, హర్యానా, కేరళ, ఉత్తరప్రదేశ్, పంజాబు మరియు ఆంధ్రప్రదేశ్ జట్లు పాల్గొన్నవి. ఆంధ్రప్రదేశ్ పురుషుల జట్టు విజయం పొందింది. స్త్రీలజట్టుకు ద్వితీయస్థానం లభించింది. జూలై, 73, జలంధర్‌లో జరిగిన అఖిలభారత పోటీలలో పురుషుల జట్టు ద్వితీయస్థానం పొందగా, స్త్రీలజట్టుకు విజయం లభించింది. మూడవ జాతీయపోటీలు నవంబరు, 1973 పూనాలో జరిగింది. మనరాష్ట్ర స్త్రీలజట్టు ద్వితీయస్థానంపొందగా, పురుషుల జట్టు విజయం సాధించింది. ప్రస్తుతం హండ్-బాలు ఫెడరేషన్ లో ఆంధ్రప్రదేశ్ నుండి మంత్రివర్యులు డి. మునుస్వామి, సి. ఎచ్. దేవానందరావు, మరియు టి. రాజగోపాలాచారి పోషకులుగనూ, చందాహుస్సేన్ ఉపాధ్యక్షులుగనూ, మహమ్మద్ యిబ్రహీం ప్రధానకార్యదర్శిగనూ, ఎమ్. యూసుపుద్దీన్ సభ్యులుగనూ వ్యవహరిస్తున్నారు. పాటియాల శిక్షణ కేంద్రములో కొద్దికాల శిక్షణ కేంద్రములో (2 మాసాలు) ఆంధ్రప్రదేశ్ నుండి హబిబుల్లా హుస్సేన్ ప్రధాన శిక్షకులుగా వ్యవహరించారు.

మన రాష్ట్రంనుండి 1972వ సంవత్సరం ఉత్తమ ఆటగాడిగా వై. మాన్యువల్, 1973వ సంవత్సరం ఉత్తమ ఆటకత్తెగా కుమారి ఏ. కాంత ఎన్నికయ్యారు.

ఆంధ్రప్రదేశ్ పురుషుల జట్టును ప్రభాకరరావు, వై. మాన్యువల్ ఎస్. జి. ఘోష్ వరుసగా మూడు జాతీయపోటీలకు నాయకత్వం వహించారు.

స్త్రీల జట్టుకు రెండవ జాతీయ పోటీలలో కుమారి యిందిరాపటేల్ మూడవ జాతీయ పోటీలకు సయిదాఖజిర్‌లు నాయకత్వం వహించారు.

## బాల్ - బ్యాడ్ మింటన్

ఈ ఆట పుట్టుక దక్షిణ భారతదేశంలోని తంజావూరు. పది సంవత్సరాల క్రితం వరకూ దక్షిణ భారతదేశంలోనే ప్రచారంలో వుండేది. అటువంటిది యీనాడు చాలా రాష్ట్రాలలో ప్రచారంలోకి వచ్చింది. షుమారు 60 సంవత్సరాల క్రితం యీ ఆట కనుగొనబడింది. 1952 నుండి 29 వరకూ మన తెలుగువారి జట్టును ఎవ్వరూ ఓడించ లేకతిపోయారు. ఆ రోజుల్లో కాశీ బ్రదర్స్, రామచంద్రపురం జట్టు ప్రఖ్యాతి గాంచినవి. ఆ జట్లలో కాశీ విశ్వనాథం, ఎస్. రామలింగ మొదలియార్ ఎన్. శంకర్, ఎస్. నారాయణరావు, బళ్ళ అప్పారావు పేరొందారు. వీరేగాక టి. రామలింగస్వామి, లంకలక్ష్మినారాయణ (లంకపులి) ఎమ్, బాలచంద్ర రావు, డి. నారాయణరావు, అన్నాజత్తుల సత్యనారాయణ, పసంగి వాగేశ్వరావు, వట్లూరి హనుమంతరావు, గజపతి, పి. శ్రీరామారావు మున్నగు వారు పేరు ప్రఖ్యాతులు గడించారు.

1953 వ సంవత్సరం అఖిలభారత బాల్ - బ్యాడ్మింటన్ ఫెడరేషన్ ఏర్పడింది. ప్రథమ అఖిలభారత జాతీయ పోటీలు హైదరాబాదులో జరుపబడినవి. ఆ సంవత్సరం పురుషుల జట్టు అయిదు, స్త్రీల జట్టు మూడు మాత్రమే పాల్గొన్నవి. ఈ నాడు జాతీయ పోటీలలో అన్ని రాష్ట్ర జట్లు పాల్గొంటున్నవి. ఇప్పటి వరకు జాతీయ పోటీలలో ఆంధ్ర, హైదరాబాదు జట్లు ప్రత్యేకంగానే పోటీ చేస్తున్నవి. 1959 సం॥ భీమవరం, 1960 సం॥ తుంగభద్రాడాం, 1964 హైదరాబాదు. 1967 రాజమండ్రి 1970 గుడివాడ, 1973 హైదరాబాదులలో జాతీయ పోటీలు జరుపబడినవి. పురుషుల పోటీలలో హైదరాబాదు 1955, 1956, 1957, 1960, 1963 సంవత్సరములలోనూ, ఆంధ్ర 1959, 1962, 1965, 1966, 1967, 1969 సంవత్సరాలలో విజయం సాధించినవి. బాలురపోటీలలో ఆంధ్ర 1958, 1960 నుండి 1966 వరకు, 1966 నుండి యిప్పటి వరకూ విజయం చేబట్టింది. స్త్రీల పోటీలలో మైసూరు జట్టు యింత వరకూ అపజయం ఎరుగదు.

హైదరాబాదు రాష్ట్రసంఘంలో ఆ రోజుల్లో మహమ్మద్, మజీద్, దస్త గిరి, రజా, మీర్జా, అలీ మహమ్మద్, హమీద్‌పాషా, అహమ్మద్ హుస్సేన్, పి. ఎస్. ప్రకాశరావు, ఖదీర్, లాయక్, సబీర్, హబీబ్, జహంగీర్‌అలీ, మొయిన్ మున్నగువారు ప్రసిద్ధిచెందారు. అఖిలభారత ఫెడరేషన్ స్థాపించి నప్పటినుండి యిప్పటివరకూ పేరొందిన తెలుగువారు: ఆర్. వి. అప్పారావు, ఎన్. వెంకటేశ్వరరావు (ఎన్నార్). పిఠాపురం సుబ్బారావు, పసంగి నాగే శ్వరరావు, నండూరి నరసింహారావు, వై. రంగాచారి, ఎమ్. రామారావు, డి. భావన్నారాయణ, సి. ఎచ్. సుబ్రహ్మణ్యం, కె. వి. ఎస్. కృష్ణమూర్తి, ఎన్. వేణుగోపాల్ (కృష్ణా), ఏ. కోదండరామయ్య, పి. సదాశివరెడ్డి, పి. హర గోపాల్, ఎమ్. ఎల్. నారాయణ, జి. రాంబాబు, బషీర్, వీరయ్య, శేషగిరి రావు, రాయుడు, డి. చిన్నా, షరీఫ్, ఎమ్. ఏ. రావు, ఎమ్. ఎస్. ఏ. పిళ్ళై, అబ్రహాం, అప్పలరాజు గోపాల్ మున్నగువారు.

బాల్-బ్యాడ్‌మింటన్ పేరు చెప్పగానే అందరికీ గుర్తుకు వచ్చేవారు పిచ్చయ్య. 1939వ సంవత్సరంనుండి బాల్-బ్యాడ్‌మింటన్ ఆటలో ప్రావీణ్యం సంపాదించి, ఈనాటికీ మేటి ఆటగానిగా పరిగణింపబడుతున్నారు. పిచ్చయ్య తర్వాత చెప్పదగినవారు ఎడమచేతి రైట్ ఆటగాడు కరీం. వారు పిచ్చయ్య శిష్యులు.

బాల్-బ్యాడ్‌మింటన్ ఆట అంతర్జాతీయక్రీడకాదు కాబట్టి ప్రతి సంవత్స రం "ఆల్‌స్టార్ ప్లేయర్" అని అయిదుగురిని ఫెడరేషన్ ఎన్నిక చేస్తుంది, ఈ స్థానం పొందిన తెలుగువారిలో పిచ్చయ్య, కరీం, భావన్నారాయణ, వహీద్ పాషా, ఇక్బాల్, ఆర్. వి. అప్పారావు, ఖాన్, రఫీక్, సుబ్రమణ్యం మున్నగు వారు వున్నారు.

## "అర్జునా" పిచ్చయ్య

జన్మస్థలం మచిలీపట్నం. ప్రస్తుతనివాసం వరంగల్లు. 1939 నుండి బాల్-బ్యాడ్‌మింటన్ ఆటగానిగా పరిగణింపబడ్డారు. 30 సంవత్సరాల బ్యాడ్ మింటన్ జీవితంలో భారతదేశంలో కొన్ని వందల విజయాలు సాధించారు.

ఆంధ్ర మరియు హైదరాబాదు రాష్ట్ర జట్టుకు నాయకత్వంకూడా వహించారు. జాతీయ పోటీలలో వీరు కన్పించకపోతే ఏదో లోటు ఉన్నట్లుగానే వుండేది. 56 సంవత్సరాల ఈ ప్రముఖ యువ ఆటగానికి భారత ప్రభుత్వం గుర్తించి 1970వ సంవత్సరం "అర్జునా" బిరుదు ఇచ్చింది.

## బాక్సింగ్ (ముష్టియుద్ధం)

హైద్రాబాదులో 1947వ సంవత్సరం మహమ్మద్ ఆలం సహాయంతో అహమ్మద్ మొయినుద్దీన్ బాక్సింగ్ సంఘమును స్థాపించారు. 1956వ సంవత్సరం ఆంధ్రప్రదేశ్ బాక్సింగ్ అసోసియేషన్ స్థాపించబడింది. 1958వ సంవత్సరం ఇరానీ, శ్యామలక్ తుది పోటీలో ఓడిపోయారు. 1972వ సంవత్సరం జరిగిన జాతీయ పోటీలలో జూనియర్స్ విభాగంలో ఆంధ్రప్రదేశ్‌కు చెందిన బి. శేషు బంగారు పతకం పొందారు. 1972వ సంవత్సరం హైదరాబాదులో 18వ జాతీయ పోటీలు జరిగినవి. ఆంధ్రప్రదేశ్‌కు చెందిన ఎల్. ఆంద్రూస్ తన తరగతి తుది పోటీ ఓడిపోయి వెండిపతకం పొందారు. 1973వ సంవత్సరం ఢిల్లీలో జరిగిన జాతీయ పోటీలలో ఆంధ్రప్రదేశ్ బాలురు ఇద్దరు తుది పోటీలో ఓడిపోయారు.

## "అర్జునా" చంద్రయా నారాయణన్

వీరి స్వస్థలం ఒంగోలు. సైనికదళంలో ఉద్యోగం. ఫ్లైవెయిట్ తరగతి జాతీయ పోటీలలో వరుసగా ఆరు సంవత్సరాలు బంగారు పతకం గెలుచుకున్నారు. 1973వ సంవత్సరం ఆసియా పోటీలలో వీరు ద్వితీయులుగా వచ్చి వెండిపతకం పొందారు. మ్యూనిచ్‌లో జరిగిన ప్రపంచ ఒలింపిక్స్‌లో వీరు భారత జట్టు సభ్యులు. ప్రస్తుతం వీరు బెంగుళూర్‌లో ఎమ్. యి. జి. లో పని చేస్తున్నారు. వీరికి భారతప్రభుత్వం "అర్జునా" అవార్డును 1972వ సంవత్సరంలో యిచ్చింది.

## క్యారమ్స్

మనతెలుగు వారు తీరిక సమయాల్లో యింట్లో కూర్చొని ఆడే ఆట యిది. ఈ ఆట మన దేశంలోనే ప్రచారంలో వుంది. అఖిలభారత క్యారమ్స్

ఫెడరేషన్ 1956 వ సంవత్సరం మద్రాసులో స్థాపించ బడింది. మన తెలుగు నాడులో ఆంధ్ర, హైదరాబాదు. సంఘాలు ప్రత్యేకంగానే వ్యవహరిస్తున్నవి. మొట్టమొదటి అఖిల భారత జాతీయ పోటీలలో 1956 వ సంవత్సరం నాగ పూర్‌లో జరిగినవి. ఈ పోటీలలో ఛాంపియన్‌షిప్‌ను ఆంధ్ర ఆటగాడ యిన పి. అప్పారావు సాధించారు. డబుల్సులో కూడా ఆంధ్ర జట్టు ఎమ్. ఏ. వేంకటేశ్వర్లు, ఎమ్. శేషగిరిరావు గెలుచుకున్నారు. 1958, 1959 సంవత్సరములు కూడా ఆంధ్ర ఆటగాడయిన అప్పారావు విజయం పొందారు. 1959 వ సంవత్సరం డబుల్సు పోటీలో పి. అప్పారావు, కృష్ణ గెలుచు కున్నారు. 1958 గుంటూరు, 1959 హైదరాబాదు, 1971 గుంటూరు, 1974 హైదరాబాదులలో అఖిలభారత జాతీయ పోటీలు జరిగినవి. 1972 వ సంవత్సరం ఆంధ్ర జట్టుకు ద్వితీయ స్థానం లభించింది. అఖిలభారత ఫెడరేషన్ ఉపాధ్యక్షులుగా ఆంధ్ర సంఘం నుండి పి. ఎస్. వెంకటేశ్వర రావు వ్యవహరిస్తున్నారు. ఫెడరేషన్ తరఫున అర్హత పొందిన రిఫరీ హైదరాబాదుకు చెందిన బి కె. హరనాథ్.

## బ్రిడ్జ్

అఖిల భారత బ్రిడ్జ్ అసోసియేషన్ 1938 వ సంవత్సరం స్థాపించ బడి, ప్రప్రథమంగా అఖిలభారత జాతీయ పోటీలు 1959 వ సంవత్సరం బొం బాయిలో నిర్వహించ బడినవి.

హైదరాబాదులో బ్రిడ్జ్ ఆటకు 1938 నుండి ప్రాముఖ్యం వుంది. ఆ రోజుల్లో మహబూబ్ ఆలీఖాన్ సైఫుద్దీన్ హుస్సేన్, అబుల్ ఖలీఖాన్, అబ్దుల్ వలీ నస్రుల్లా, మహమ్మద్ మియా ఉత్తమ ఆటగాళ్ళుగా పర గణింపబడ్డారు. వారు 1938 సంవత్సరం కలకత్తాలో జరిగిన పోటీలో పాల్గొని బంగారు కప్పును గెలుచుకున్నారు. 1959 వ సంవత్సరం ప్రథమ జాతీయ పోటీలలో హైదరాబాదు జట్టు పాల్గొని విజయం సాధించింది. 1960 వ సంవత్సరం తురిన్‌లో జరిగిన ప్రపంచ పోటీలలో భారత ప్రతినిధులుగా ఏ. రామమూర్తి, పి. తిలక్ ఎన్నికై ప్రపంచ పోటీలలో పాల్గొన్నారు.

1961 వ సంవత్సరం హైదరాబాదులో మూడవ జాతీయ పోటీలు జరిగినవి. ఆంధ్ర బ్రిడ్జ్ అసోసియేషన్ 1951 వ సంవత్సరం స్థాపించ బడింది. ఆంధ్ర జట్టు 1956, 1957, 1958 సంవత్సరములు వరుసగా మద్రాసులో జరిగిన దక్షిణ భారత పోటీలలో పాల్గొని గెలుపొందింది. నవంబరు, 1960 సంవత్సరం ఇండోర్‌లో జరిగిన రెండవ అఖిల భారత బ్రిడ్జ్ పోటీలలో ఆంధ్ర జట్టు 28 పాయింట్లతో ద్వితీయ స్థానం పొందింది. ఆంధ్ర జట్టులో ఎన్ వెంకట్రావు (నాయకులు) డా. సి సాంబశివరావు, కె. అప్పారావు ఎన్ తిరుమల రావు, వి. శ్యామ్‌ప్రసాద్, కె. సుబ్బరామశాస్త్రి పాల్గొన్నారు. 1963 వ సంవత్సరం బెంగుళూరులో జరిగిన దక్షిణమండల బ్రిడ్జ్ పోటీలలో మద్రాసు ప్రథమస్థానం, ఆంధ్ర ద్వితీయస్థానం హైదరాబాదుకు తృతీయ స్థానం లభించింది.

ఆంధ్రప్రదేశ్ అవతరించిన కొద్దిసంవత్సరాలకే ఆంధ్ర హైదరాబాదు సంఘాలు ఆంధ్రప్రదేశ్ బ్రిడ్జ్ అసోసియేషన్‌గా రూపొందింది. 1972 సంవత్సరం ప్రపంచపోటీలకు ఆంధ్రప్రదేశ్ నుండి డా॥ సి. సాంబశివరావు, కోటీశ్వర రావు, వి. ఎస్. ఎన్. శర్మ, మేజర్ హరీష్ చంద్ర ఎన్నికైనారు. డిసెంబరు 1974, కలకత్తాలో జరిగిన అఖిలభారత జాతీయ పోటీలలో మన ఆంధ్ర ప్రదేశ్ జట్టు వరుసగా రెండవసారి విజయం పొంది, రూయా ట్రోఫీని చేబట్టింది ఆంధ్రప్రదేశ్ జట్టుకు భారతదేశ ఉత్తమ ఆటగానిగా ఎన్నికైన ఏ. ఎస్. ముర్తాజా ఖాద్రి నాయకత్వం వహించారు. విజయం పొందిన ఈ జట్టులో మలానీ, పి. పి. రెడ్డి, ముర్తాజా హుస్సేన్, ఎస్. సంజీవా పాల్గొన్నారు.

## టెని-కాయిట్

ఈ ఆటను చాలా మంది రింగ్-టెన్నిస్ అంటారు. ఇది చాలా ప్రాచీన క్రీడ. ఈరోజున చాలా రాష్ట్రాలను ఆకర్షించింది. మొదటి మూడు అఖిలభారత జాతీయ పోటీలు ఆంధ్రప్రదేశ్ తరఫున హైదరాబాద్‌లో జరిగినవి. ఈ పోటీలలో తమిళనాడు, ఢిల్లీ, బీహారు, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, ఛండిఘర్, కర్ణాటక, భారత రైల్వే, ఆంధ్రప్రదేశ్, విదర్భ జట్లు పోటీచేసినవి.

ఈ పోటీలలో మన రాష్ట్ర పురుషుల జట్టు విజయం సాధించగా, స్త్రీల జట్టుకు తృతీయ స్థానం లభించినది. విజేతలైన పురుషుల జట్టులో సురేష్ పొదార్ (నాయకులు) కె. యన్. నరసింహారావు. ఎన్. సత్తూరు, వి. యాదగిరి కలరు. భారతఛాంపియన్‌గా మన రాష్ట్ర ఆటగాడు కె. ఎన్. నరసింహారావు ద్వితీయుడుగా సురేష్ పోదార్ నిలబడ్డారు. ద్వితీయస్థానం పొందిన స్త్రీల జట్టులో పద్మలతా సేన్ (నాయకురాలు), నళినిదేశపాండే, ఆర్. వి. విజయలక్ష్మి, భానుమతి కలరు. భారతదేశం మొత్తం మీద ద్వితీయ స్థానం మనరాష్ట్ర ఆటకత్తె పద్మలతా సేన్‌కు లభించింది. భారత టెని-కాయెట్ ఫెడరేషన్‌లో ప్రధాన కార్యదర్శిగా మనరాష్ట్రంనుండి ఎస్. వెంకట్రామరెడ్డి, కోశాధికారిగా టి. రామమూర్తి వ్యవహరిస్తున్నారు. భారత రిఫరీ ఫెడరేషన్‌కు అధ్యక్షులుగా టి రామమూర్తి, కన్వీనర్‌గా సి. సత్యనారాయణ వ్యవహరిస్తున్నారు. అర్హతపొందిన భారత ఫెడరేషన్ రిఫరీలుగా మన రాష్ట్రం నుండి వి. జగన్నాథం, సురేష్‌కాలె, పి. రామకృష్ణరావు, నరసింగరావు, టి. అశోక్ వ్యవహరిస్తున్నారు.

## సైక్లింగ్

సైక్లింగ్ చక్రాని క్రీడగా మనతెలుగునాడులో విశేషప్రచారంలోవుంది. అఖిలభారతపోటీలలో ఆంధ్రప్రదేశ్ జట్టుపాల్గొంటూనేవున్నది. ఆంధ్రప్రదేశ్ అవతరణ జరగగానే, ఆంధ్ర, హైదరాబాదులు విలీనమై ఆంధ్రప్రదేశ్‌గా అవతరించింది. ఆంధ్రప్రదేశ్ సైక్లింగ్‌అసోసియేషన్‌లో ప్రముఖపాత్రవహిస్తున్న కె. రామస్వామి దక్షిణ భారత సైక్లింగ్ శిక్షకులుగా ఎన్నికైనారు. 27వ అఖిలభారత జాతీయ పోటీలు ఆంధ్రప్రదేశ్ సైక్లింగ్ అసోసియేషన్ ఆధ్వర్యమున హైదరాబాదులో 1972వ సంవత్సరం జరిగినవి. ఇప్పటివరకు జాతీయ పోటీలలో పేరొందిన వారు కుమారి మరెన్ పావెల్, బి. లక్ష్మణరాజ్, సంషీర్‌ఖాన్.

## బిలియార్డ్స్

ఈ ఆట 1828 నుండి మన భారతదేశంలో ప్రచారంలో వుంది. అఖిల భారత ఛాంపియన్‌షిప్ పోటీలు 1931 నుండి ప్రారంభమయినవి. ప్రపంచ బిలియార్డ్స్ పోటీలలో భారతజట్టు ప్రతినిధిగా పాల్గొన్న మొట్ట మొదటి తెలుగు

వారు ములుకుట్ల శివరామశాస్త్రి. వీరు చిన్నప్పటినుండి తండ్రి గారితో ఏలూరు క్లబ్‌కు వెళ్ళి, యీ ఆటలో సాధనచేసి చిన్నవయస్సులోనే అనేక విజయాలు చేబట్టారు. 1955 వ సంవత్సరం ప్రపంచ ఛాంపియన్ అయిన అస్ట్రేలియా ఆటగాడు బాబ్‌మార్షల్ మన భారతదేశ పర్యటనకు వచ్చినప్పుడు, వారితో ఎగ్జిబిషన్ పోటీలలో పాల్గొన్నారు. వీరి తర్వాత చెప్పదగినవారు టి. ఏ. సూరి. వీరు 1946వ సంవత్సరం మద్రాసులో వున్నప్పుడు మద్రాసు బిలియార్డ్సు అసోసియేషన్ స్థాపించి, 1958 వరకు గౌరవ సంయుక్త కార్యదర్శిగా వుంటు, అనేక టోర్నమెంట్సు నిర్వహించారు. బాబ్‌మార్షల్, టామ్‌క్లియర్, హోరెస్ లిండ్రమ్ వంటి ప్రపంచ ఛాంపియన్లతో దక్షిణభారత దేశం పర్యటించారు. వీరి తర్వాత చెప్పదగినవారు టి. జి. కృష్ణ. వీరు సింహళంలో జరిగిన పోటీలకు ఆహ్వానింపబడి తుదిపోటీలో భారత ప్రముఖ ఆటగాడయిన సెల్వరాజ్‌చే ఓడించబడ్డారు.

## కో, కో

ఇది మన దేశీయ క్రీడ. అఖిలభారత జాతీయ పోటీలు 1960 నుండి ప్రారంభించబడినవి. మొట్టమొదట విజయవాడలో జరిగినవి. ఇందు ఆంధ్ర జట్టుకు ద్వితీయస్థానం లభించింది. 1965 వ సంవత్సరం జాతీయ పోటీలు హైదరాబాదులో జరిగినవి. 1975 వ సంవత్సరం దేవాస్‌లో జరిగిన జాతీయ పోటీలలో ఆంధ్రనుండి పురుషులు, బాలురు, స్త్రీలజట్టు అర్ధాంతిమ పోటీలలో ఓడిపోయినవి. అఖిల భారత ఫెడరేషన్ ప్రధాన కార్యదర్శిగా ఓంకార్ ప్రసాద్, టెక్నికల్ కమిటి ఛైర్మెన్‌గా ఛందా హుస్సేన్ మన రాష్ట్రంనుండి ఎన్నుకోబడ్డారు. ఫెడరేషన్ ప్రథమ తరగతి రిఫరీలుగా ఆంధ్రనుంటి ఎన్. రాధాకృష్ణ హైదరాబాదు నుండి ఛందాహుస్సేన్, ఆర్. యస్. విష్ణుకుమార్ వ్యవహరిస్తున్నారు.

## సాఫ్ట్-బాల్

ఇది అమెరికన్ ఆట. ఈ ఆటనే బేసు-బాలు, మరియు ప్లే గ్రౌండ్ బాలు అనికూడా పిలిచేవారు. 1926 వ సంవత్సరంలో కొలరేడో క్రీడా శిక్షకుడు వాల్టరు హాకిన్సన్ "సాఫ్ట్-బాల్" అనే పేరు పెట్టారు. 1932 వ సంవత్సరం ప్రసిద్ధ

క్రీడాకారు లందరూ చికాగో నగరంలో సమావేశమై ఆటచట్టాలను ఆమోదించారు. 1946 వ సంవత్సరం కొన్ని ముఖ్యమైన మార్పులను చేసారు. మన దేశంలో సాఫ్టు-బాలు ఆట ప్రచారానికి డా॥ జి. ఎన్. ఆండ్రూస్ మరియు పి. ఎమ్. జోసఫ్ విశేషకృషి చేసారు.

మన భారతదేశంలో మొట్టమొదటి సాఫ్ట్ - బాలు జాతీయ పోటీలు 1968-69 వ సంవత్సరం హర్యానాలో ప్రారంభించ బడినవి. ఆ పోటీలలో మన ఆంధ్రప్రదేశ్ జట్టు విజయం సాధించింది. మన ఆంధ్రప్రదేశ్ సాఫ్ట్-బాలు అసోసియేషన్ 1966 వ సంవత్సరం స్థాపించ బడింది. ఆంధ్రప్రదేశ్ జట్టు వరుసగా అన్ని జాతీయ పోటీలలోనూ పాల్గొని, మొదటి మూడు జాతీయ పోటీలలో విజయం చేబట్టింది. మూడవ జాతీయ పోటీలు మన ఆంధ్రప్రదేశ్ సాఫ్ట్-బాలు అసోసియేషన్ ఆధ్వర్యమున హైదరాబాదులో జరిగినవి. భారత ఫెడరేషన్‌లో మన ఆంధ్రప్రదేశ్ నుండి పోషకులుగా కె. ఆర్. నర్సారెడ్డి, సహాయ కార్యదర్శిగా రామ్‌లాల్ వాఘ్రే వ్యవహరిస్తున్నారు.

## వెయిట్ - లిఫ్టింగ్

భారత దేశంలో ప్రప్రథమంగా ఆధునిక వెయిట్-లిఫ్టింగ్ విధానములను ప్రవేశ పెట్టినవారు ఎస్. మజుందార్. వెయిట్ - లిఫ్టింగ్ పోటీలు భారత దేశంలో 1924 వ సంవత్సరం నుండి ప్రారంభ మయినవి. 1936 వ సంవత్సరం ప్రపంచ ఒలింపిక్స్‌లో ఒక్క వెయిట్ - లిఫ్టర్ పాల్గొన్నారు. 1951 వ సంవత్సరం నుండి "భారత శ్రీ" దేహ సౌష్ఠవ పోటీలు ప్రారంభ మయినవి. చెన్నుపాటి రామకోటయ్య, గజ్జె వీర రాఘవగుప్త, ఏ. పి. రంగా, శిష్టా సోమయాజులు కృషివల్ల 1947 వ సంవత్సరం ఎం. ఆర్. అప్పారావుగారి అధ్యక్షతన విజయవాడలో ఆంధ్రా ఎమెచూర్ వెయిట్-లిఫ్టింగ్ అసోసియేషన్ స్థాపించబడింది. ఈ సంఘకృషివల్లనే ఆంధ్ర వెయిట్ - లిఫ్టర్స్ అమెరికన్ ప్రముఖుడు హస్మన్‌వద్ద, సోవియట్ ప్రముఖుడు లుబవైన్ వద్ద శిక్షణ పొందే అవకాశం లభించింది. 1955 వ సంవత్సరం "భారత శ్రీ" బిరుదు మన తెలుగువారైన ఆర్జా జనార్ధనరావు (సినీ నటులు)కు లభించింది. వీరు మద్రాసు రాష్ట్ర ప్రతినిధిగా పోటీలలో పాల్గొన్నారు. 1951 వ సంవత్సరం ఢిల్లీలో

జరిగిన ప్రథమ ఆసియా క్రీడోత్సవంలో "ఆసియాశ్రీ" పోటీలలో పాల్గొని తన ఎత్తు తరగతిలో ప్రథములుగా వచ్చి, అన్నితరగతులలోనూ ద్వితీయ స్థానం పొంది "కాశ్మీరు బాకు" బహుమతిని పొందారు.

కృష్ణా జిల్లా వాస్తవ్యులైన దండమూడి రాజగోపాల్ 1944 వ సంవత్సరం భారతదేశంలో అనేక బలప్రదర్శనలు యిచ్చి "ఇండియన్ టార్జాన్" బిరుదును పొందారు. 1946 వ సంవత్సరం బెంగుళూరు ఒలింపిక్స్‌లో మైసూరు రాష్ట్రప్రతినిధిగా పోటీచేసి, ప్రథమస్థానం పొందారు. 1947 లో బర్మాలో జరిగిన అంతర్జాతీయ బరువునెత్తు పోటీలలో భారత ప్రతినిధిగా పాల్గొన్నారు. 1948 లండన్ ఒలింపిక్స్‌లో కూడా పాల్గొన్నారు. అప్పుడే అనేక దేశాలు కూడా పర్యటించారు. 1921 వ సంవత్సరం ఢిల్లీలో జరిగిన ప్రథమ ఆసియా క్రీడోత్సవాలలో హెవీ వెయిట్ తరగతిలో పాల్గొని, తృతీయ స్థానాన్ని పొందారు. 1954 వ సంవత్సరం ఆంధ్రరాష్ట్ర ప్రతినిధిగా ఢిల్లీలో జరిగిన ఒలింపిక్స్ పోటీలలో పాల్గొని ప్రథమస్థానం వహించడమే కాకుండా మూడు కొత్త రికార్డులను కూడా నెలకొల్పారు. 1956 వ సంవత్సరం 16 వ ఒలింపిక్స్ పోటీలలో కూడా పాల్గొన్నారు. వరుసగా మూడు ప్రపంచ ఒలింపిక్స్‌లలో పాల్గొనిన మొదటి తెలుగువారు వీరే. వీరి తర్వాత చెప్పదగినవారు కామినేని ఈశ్వరరావు.

## "అర్జునా" ఈశ్వరరావు

1963 వ సంవత్సరం భారతప్రభుత్వం వీరికి "అర్జునా" బిరుదును యిచ్చింది. బరువునెత్తు పోటీలలో ఆసియా రికార్డును అధిగమించిన తెలుగువారు వీరే. ఢిల్లీలో ప్రథమ ఆసియా క్రీడోత్సవ పోటీలలో ద్వితీయస్థానం పొందారు. అదే సంవత్సరం హెల్సింకీలో జరిగిన ప్రపంచ ఒలింపిక్స్‌లో పాల్గొన్నారు. వార్సాలో జరిగిన ప్రపంచ యువజన క్రీడోత్సవంలో కూడా పాల్గొన్నారు. వీరు చైనా, రష్యా పర్యటించి బలప్రదర్శనలు యిచ్చారు. 1956 వ సంవత్సరం మెల్బోర్న్‌లో జరిగిన ప్రపంచ ఒలింపిక్స్‌లో కూడా పాల్గొన్నారు. 1961 వ సంవత్సరం ఎర్నా

కుశంలో జరిగిన 13 వ అఖిలభారత పోటీలలో లైట్ - హెవీ - వెయిట్ తరగతిలో ప్రథమ స్థానం పొందారు.

1962 వ సంవత్సరం కలకత్తాలో జరిగిన జాతీయపోటీలలో బాంటమ్ తరగతిలో హైదరాబాదుకు చెందిన యమ్. యాదగిరి ప్రథమస్థానం పొందారు.

ఈ సంవత్సరం ఆంధ్రప్రదేశ్ వెయిట్ -లిఫ్టింగ్ అసోసియేషన్ అధ్వర్యమున హైదరాబాదులో జాతీయ పోటీలు నిర్వహించ బడినవి.

## కుస్తీ

ఆంధ్రరాష్ట్రం ఏర్పడ గానే, 1954 వ సంవత్సరం రాష్ట్ర ఎమచూర్ రెజ్లింగ్ అసోసియేషన్, పాపోలు వీరవెంకయ్య, గట్టెవీర రాఘవ గుప్త, మోచర్ల శ్రీ హరి రావు కృషి వల్ల స్థాపించ బడింది. నెల్లూరు నివాసి అయిన ఎన్. కాంతారావు కుస్తీ పోటీలలో అంతర్జాతీయ ఖ్యాతి గడించారు. ఆంధ్ర ప్రదేశ్ అవతరించగానే ఆంధ్రప్రదేశ్ రెజ్లింగ్ అసోసియేషన్‌గా రూపొందింది. హైద్రాబాదులోని హనుమాన్ వ్యాయామశాల కుస్తీలో యువకులను పైకి తెచ్చుటకు తీవ్ర కృషి చేస్తున్నది. మోచర్లశ్రీహరిరావు భారత రెజ్లింగ్ అసోసియేషన్‌లో ఉపాధ్యక్షులుగా వ్యవహరిస్తున్నారు.

## ఈత

1960 సం॥ రోమ్‌లో జరిగిన 17 వ ప్రపంచ ఒలింపిక్స్‌లో భారత జట్టులో సైనిక దళం నుంచి ఎన్నికైన షంషేర్ ఖాన్ మన తెలుగువారే. వారి స్వగ్రామము గుంటూరు జిల్లా, తెనాలి.

←○→

# దేశ భాషలందు తెలుగు లెస్స








ప్రపంచ తెలుగు మహాసభలు

*1975 ఏప్రిల్ 12—18*